

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 14-6-1

క్లి ఫుట్ బాల్ పందాల్లో విజయం పొందిన ఆర్సెనాలాదళం. జుగారివద్ద రజితపాత్రను బహుమతి పుచ్చుకున్న అనంతరం మ కాప్టెన్ను బుజాలమీద కెత్తుకుని హుషారు చేస్తున్నారు.

జర్ ప్రొజెక్టరు ప్రదర్శన: బ్రిటిషు మాన్యుఫాక్చరర్సు ఫెడ ంవారు యిటీవల లండన్ లో ఏర్పాటుచేసిన ప్రయివేటు ప్రదర్శనలో ఒకదృశ్యం.

లండన్ లోని మిల్ హిల్ వైద్యపరిశోధనా కేంద్రం—షాంఘై వచ్చిన డాక్టర్ జి. యమ్. చూ చలిజ్వరక్రిములవిషయ పరిశోధనలు చేస్తున్నారు.

ఈ క్రొత్తరకం విమానాన్ని ఒక న్యూజిలాండ్ కంపెనీ త చేసింది. 74 గురు ప్రయాణీకులను ఎక్కించుకుని గంటకు 500 మైళ్లుపోతుంది.

# వార్తలు - విశేషాల

# ఆంధ్రపత్రిక


సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవియొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **42**
సంచిక **41**

వికృతి సంవత్సర జ్యేష్ఠ బహుళ చతుర్దశి బుధవారము




## సమష్టి బాధ్యత

'మంత్రివర్గ కార్యనిర్వహణకంతా సమష్టిబాధ్యత ప్రధానసూత్రం' —పండిట్ నెహ్రూ.





1950–వ సం॥ జూన్ నెల 14–వ తేది బుధవారము

# ఐక్య ఆసియా

ఇతరత్రా కలుగగల సైనికఫలితములతో నిమిత్తము లేక ఆసియారాజ్యము లన్నియు మైత్రీ, సహకారములను వృద్ధిచేసుకొనుటకు వివిధరాజ్యముల మధ్య సుహృద్భావమును పెంపొందించుటకు సమావేశము కావచ్చునని భారతప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఇండొనీషియా శాసన సభలసమావేశమునందు చేసిన ప్రకటనతో స్వతంత్ర ఆసియా రాజ్యప్రతినిధు లందరు ఏకీభవింతు రనుటకు సందేహము లేదు. పండిట్ నెహ్రూ ఇండొనీషియాయాత్ర నుగురించి వ్రాయుచు - ఈ సంచారఫలితముగ అఖిలాసియా రాజ్యముల సమావేశము జరుగవచ్చునని, అట్టి సమావేశపర్యవసానముగ అఖిలాసియాసమాఖ్య ఏర్పడగలదని సూచించియుంటిమి. సిడ్నీ, బాగ్వియో సమావేశముల అనంతరము ఇప్పటివరకు కేవలము సాధింపవలసిన లక్ష్యముగమాత్రమే యున్న ఐక్య ఆసియాభావమునకు పండిట్ నెహ్రూ ఇండొనీషియా యాత్రవలన ఒక వాస్తవికస్వరూప మేర్పడుచున్నదని ఇండొనీషియా ప్రజాప్రతినిధుల సభాధ్యక్షుని స్వాగతప్రసంగము స్పష్టముచేయుచున్నది.

భారతప్రధానమంత్రి 1949వ సంవత్సరము జనవరిలో న్యూఢిల్లీయం దేర్పాటుచేసిన ఆసియారాజ్యముల సమావేశమునందు పాల్గొనిన అనేకదేశముల ప్రతినిధులు శాశ్వతమైన ఒక ఆసియారాజ్యముల సహాలోచనసంఘమును స్థాపింపవలెనని సూచించిరి. కాని ఆ సమావేశము కేవలము "ఇండొనీషియాపై హాలెండ్ జరిపిన దురాక్రమణ"ను చర్చించి స్వతంత్ర ఇండొనీషియాస్థాపనకు అనుసరణీయమైన మార్గములను అన్వేషించుటకు ఏర్పాటైనదనియు, అట్టి సమావేశమునందు ఇతరసమస్యలను - అవి ఎంతప్రధానమైనవి అయినప్పటికిని- చర్చించిన అసలుసమస్య అప్రధానమగునని పండిట్ నెహ్రూ ఆక్షేపణ తెలిపియుండెను.

ఇండొనీషియా సంపూర్ణస్వాతంత్ర్యమును పొందుటతో, జపానుశాంతిఒడంబడిక జరుగకపోయినప్పటికిని, ఎన్నికలు జరిగి అచట ప్రజాప్రతినిధులతో ప్రభుత్వ మేర్పడుటతో, ఒక్క మలయా, ఇండోచైనా దేశములు మినహాగా మిగత ఆసియారాజ్యము లన్నియు స్వాతంత్ర్యమును పొందినవి. పారిశ్రామికముగ ఇతరపాశ్చాత్య దేశములతో సమముగ అభివృద్ధిచెందిన జపాన్ మినహా మిగతా ఆసియా దేశము లన్నియు ఒకేవిధమైన సమస్యలను ఎదుర్కొనవలసియున్నవి. సమితి దూరప్రాచ్య, ఆసియాఆర్థికసంఘము, ఆర్థికపారిశ్రామిక, వాణిజ్య రంగములందు ఈ ఆసియారాజ్యముల నన్నింటిని సంఘటితపరచవలసియుండెను. కాని ఆసంఘమునందును, బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా, హాలెండ్ మొదలగురాజ్యములే ప్రాధాన్యము వహించుచుండుటవలనను, ఇతర సమితిసంఘములందువలెనే ఈ సంఘమునను ప్రాక్ పశ్చిమవిభేదములు తీవ్రమై సంఘకార్యకలాపమునకు అంతరాయములు కల్గించుచున్నందున ఈ ఉపసంఘము నిరర్థకమగుచున్నది. విషయసేకరణను మించి ఇంతవరకు ఈ సంఘము చేసిన దేమియు లేదు.

ఇట్టి సంఘములు ప్రయోజనకరము కావలెనన్న దూరప్రాచ్యఆసియా దేశము లన్నియు సమష్టిగ వ్యవహరించుట అత్యవసరము. మధ్యప్రాచ్యమునందలి అరబ్ రాజ్యములు కేవలము మతదృష్ట్యా ఒక ప్రత్యేకవర్గముగ ఏర్పడినవి. పాకిస్తాన్ అట్టి మతాధారసంఘముల స్థాపనమునే ప్రోత్సహించుచున్నది. ఇట్టి సంఘములవలన ప్రయోజనములకంటె ప్రమాద

ములే అధికముగ నుండగలవు. ప్రధానముగ ప్రజా స్వామికదృష్ట్యా, ఆర్థిక, సాంఘిక, రాజకీయావసరములు ఆధారముగ ఏర్పడిన సంఘములే శాశ్వతముగ నిలబడగలవు. అట్టి సంఘమునందలి సభ్యుల అభివృద్ధికి, తద్వారా ప్రపంచశాంతికి ఈ సంఘములు ప్రయోజనకరమైన సాధనలు కాగలవు.

ఇండొనేషియానాయకులు ముస్లింలైన కారణముగ పాకిస్థాన్ ఆ దేశముతో సన్నిహితసంబంధములను ఏర్పరుచుకొని ప్రపంచముస్లింరాజ్యకూటమిని ఏర్పరచి తన నాయకత్వమును స్థిరపరచుకొనుటకు ప్రయత్నించెను. ఇండొనేషియానాయకులు అట్టి హ్రస్వదృష్టిని వదలి, విశాల రాజకీయాదర్శములతో వ్యవహరించినందున ఆసియారాజ్యములను సంఘటితపరచుట సాధ్యమైనది. దాదాపు ఆసియాయందలి అన్నిదేశములతో భారతదేశమునకు సాంస్కృతికవ్యాపారసంబంధములు గలవు. బౌద్ధమతప్రాబల్యమువలననే ఈ దేశము లన్నింటిమధ్య గాఢమైన సాంస్కృతికసంబంధములు ఏర్పడియున్నప్పటికిని, భారతదేశమున ఆ మతము క్షీణించినను ఈ సాంస్కృతికసంబంధములు విచ్ఛిన్నము కాలేదు. భారతదేశమునకును, ఇతర ఆసియారాజ్యములకును గల గాఢమైన సంబంధములు 1946 వ సంవత్సరమున న్యూఢిల్లీయందు జరిగిన ఆసియావ్యవహారముల సమావేశము గాఢమొనర్చినది. పండిట్ నెహ్రూ ఈ సంవత్సరారంభమున సింహళమునకును, ఇప్పుడు ఇండొనేషియాకును, ఇండొనేషియానుండి తిరిగివచ్చునపుడు సింగపూర్, బర్మాలకును వెళ్ళివచ్చుటవలన ఈ దేశములమధ్య ఏర్పడిన మైత్రీభావము అభివృద్ధి చెంది ఐక్యఆసియా అవతరణకు అనుకూలపరిస్థితులను కల్పింపగలదు.

భారత ప్రధానమంత్రి ఈ పర్యటనను ముగించుకొనివచ్చినతదుపరి ఆసియారాజ్యాధిపతుల సమావేశమును ఏర్పాటుచేసి ఇండో-చైనా, మలయా సమస్యల సత్వరపరిష్కారమునకు అవలంబింపతగిన మార్గములను అన్వేషించి ఇండొనేషియాసమస్యా పరిష్కారమునకు తోడ్పడినట్లే, ఈ సమస్యల పరిష్కారమునకును తోడ్పడిన ఐక్యఆసియానిర్మాణము సులభముగ జరగగలదు. అట్టి సమావేశమునకు కమ్యూనిస్టుచైనాను, వియట్‌మిన్ నాయకులను కూడా ఆహ్వానించిన ప్రస్తుతము సమితియందు ఏర్పడిన ప్రతిష్టంభనాపరిష్కారమునకు అనుకూలమైన పరిస్థితులను కల్పింపవీలగును. ఈ విధముగ పండిట్ నెహ్రూ ఇండొనేషియాయాత్ర విశేషప్రాధాన్యమును వహించుచున్నది.

## కాశ్మీర్ సమస్య: డిక్సన్ పథకము

"కాశ్మీర్ మధ్యవర్తి సర్ ఓవెన్ డిక్సన్ చాలా మంచివాడు. ఆయన కరాచీ వచ్చినప్పుడు కాశ్మీరు సమస్యాపరిష్కారానికి క్రొత్తపథకాన్ని ఏమీ సూచించియుండలేదు" అని పాకిస్థాన్‌విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ లాహోరులో పత్రికావిలేఖరులతో ముచ్చటించుచు చేసిన ప్రకటన యథార్థస్థితిని ఎంతవరకు వెల్లడించుచున్నదో చెప్పుట కష్టము. సర్ జఫ్రుల్లాఖాన్ ఈ యభిప్రాయములను వెల్లడించుటకు ముందుదినము కరాచీ 'డాన్' పత్రిక సర్ ఓవెన్ ఒక క్రొత్తపథకమును సూచించినట్లును, ఆ పథకమునకు ఆధారము రష్యానురాక్రమణభయమే నని ప్రకటించెను. 'డాన్' పత్రిక ఉద్ధృతసంచికయందుసూత్రమే ఈక్రొత్త పథకమువివరములు ప్రకటింపబడుట గమనింపతగియున్నది. సర్ ఓవెన్ ఈపథకమును అధికారరీత్యా ప్రతిపాదించియున్నను, ప్రతిపాదించియుండకపోయినను, పాకిస్థాన్ ఇట్టి పరిష్కారమునకు సమ్మతింపవచ్చునని 'డాన్' పత్రికప్రకటనమును బట్టి గ్రహింపవచ్చును. అసలు కరాచీవర్గములే ఇట్టి సూచనను ప్రతిపాదించియున్నను అందు ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు. బ్రిటన్, అమెరికా ప్రభుత్వములు ఇట్టి పరిష్కారమును హర్షించు ననుటకును ఎట్టి సందేహము లేదు.

కాశ్మీరుసమస్య ఇంతటి అంతర్జాతీయప్రాధాన్యము వహించుటకు రష్యా, కమ్యూనిస్టుచైనా ప్రాబల్యము గల ప్రాంతములు ఈ సంస్థానమునరిహద్దున నుండుటే కారణము. బ్రిటన్‌గాని, అమెరికాగాని కాశ్మీరు సమస్యను సంస్థానప్రజలదృష్ట్యాగాక రష్యాపై 'ప్రజాస్వామికరాజ్యములు' జరుపవలసిన యుద్ధఅవసరముల దృష్ట్యా పరిశీలించి తదనుగుణముగ పరిష్కారమార్గమును సూచించుచున్నవి. భద్రతాసమితి 1948 ఏప్రిల్‌తీర్మానముప్రకారము జనవాక్యనిర్ధారణ

ద్వారానే ఈ సమస్య పరిష్కారము కావలెనన్న, అది ఇంతలో సాధ్యము గాదు. కాశ్మీర్ ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లా ఉద్ఘాటించినట్లు సంస్థానమునుండి ఆజాద్ కాశ్మీర్ పటాలముల ఉపసంహారణ జరుగవలెను. గిల్గిత్ నుండి సుచేత్‌ఘడ్ వరకు ప్రస్తుతం ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వ పరముగ నున్న ప్రాంతము-సంస్థానప్రభుత్వ అధీనము కావలెను. సంస్థానమును వదలి వెళ్లిపోయినవారందరు తిరిగి రావలెను. వారందరికి పునరావాసము కల్పింపవలెను. భద్రతామండలి నియమించిన మధ్యవర్తి సంఘము కూడ జనవాక్యనిర్ధారణకుపూర్వము ఈపని యంతయు జరుగవలసియుండునని తెలిపెను. ఈ మధ్యవర్తిసంఘుతీర్మానమును, భారత పాకిస్థాన్ ప్రభుత్వములు స్థూలముగా అంగీకరించియుండెను.

కాని ఆజాద్ కాశ్మీర్ సైనికదళముల ఉపసంహారము, సంస్థానమునందలి ఉత్తరప్రాంతముపై అబ్దుల్లా ప్రభుత్వఅధికార మేర్పడుటవిషయమై పాకిస్తాన్ ప్రభుత్వము మధ్యవర్తిసంఘుతీర్మానమునకు భిన్నార్థము కల్పించి, ఆ తీర్మానమును అమలుజరుప నిరాకరించెను. మధ్యవర్తిసంఘము ఎంత ప్రయత్నించినప్పటికిని ఈ రెండుఅంశములపై భారత-పాకిస్తాన్ ప్రభుత్వములకు సమాధానము కుదరలేదు. ఆ సమాధానమును సాధించుటకే భద్రతామండలి మధ్యవర్తిసంఘముస్థానే ఒకే వ్యక్తిని మధ్యవర్తిగ నియమించుట జరిగెను. సంస్థాన ముఖ్యమంత్రి సూచించిన షరతులను సర్ ఓవెన్‌డిక్సన్ ఎంతవరకు సఫలమొనర్చగలరో చూడవలసియున్నది.

డిక్సన్ ఇంతవరకు జరిపిన సంప్రతింపులవల్ల ఒక్క విషయము స్పష్టమగుచున్నది. కాశ్మీర్‌లో జనవాక్యనిర్ధారణ ఇంతలో జరుగకపోవచ్చును. వీరు మెక్నాటన్ ప్రతిపాదనలనే కొద్ది మార్పులతో పునరుద్ధరింపవచ్చును. కాశ్మీర్ భవిష్యత్తు నిర్ధారణయగు వరకు సంస్థానముపై భారత-పాకిస్తాన్ ప్రభుత్వముల జాయింట్ ఆధిపత్యమును ఏర్పాటుచేయుటకు వీరు ప్రయత్నింపవచ్చును. అయితే ఇవి కాశ్మీర్ సమస్యను పరిష్కరింపజాలవనిమాత్రము చెప్పవచ్చును.

---

# విషయానుక్రమణిక

## 14 జూన్ 1950

# మనదేశం

## రాజప్రముఖ్ కాదు, ఇంకా నిజాంగారే *

అనేకవారాలు ఢిల్లీ హైదరాబాద్‌ల మధ్య సంప్రదింపులు నడిచి చిట్టచివరికి హైదరాబాద్ మంత్రివర్గంలో నలుగురు కాంగ్రెస్ వాదుల్ని మంత్రులుగా నియమించడానికి ఒప్పందం కుదిరింది. సంస్థాన కాంగ్రెస్‌లోని రెండు పక్షాలకీ అంగీకారం కుదిరి అధ్యక్షులుగా ఎన్నుకోబడిన దిగంబర్రావ్ బిందూ గారి కృషి ఫలితంగా ఇది ఒనగూడింది.

1950 జనవరి 26 వ తేదీని రాజప్రముఖ్‌గా ప్రమాణం స్వీకరించిన ఉస్మాన్ అలీ గారు ఇంకా "మహాఘనతవహించిన నిజాం" గానే ఫర్మానా జారీచేసి నలుగురు కాంగ్రెస్ మంత్రుల్ని నియమించారు. కాబట్టి హైదరాబాద్ రాజ్యాన్ని ఇంకా నిజాంగారి సంస్థానం కిందనే జమకట్టవచ్చును.

భారత ప్రభుత్వ సంస్థానశాఖవారి సలహాపైన ఇదివరలో నిజాంగారు నియమించిన వారిలో ఈ క్రింది ముగ్గురూ (సంస్థానశాఖవారి సలహాపైనే) రాజీనామా లిచ్చారు: శ్రీ డి. యస్. బాఖ్లే, రాజా ధోండిరాజ్ బహదూర్, శ్రీ పి. హెచ్. కృష్ణరావు. వీరిస్థానే సంస్థానకాంగ్రెస్‌కి చెందిన ఈ క్రింది నలుగురినీ మంత్రివర్గంలో నియమించారు: శ్రీ బూర్గుల రామకృష్ణరావు, శ్రీ వల్లూరి బసవరాజు, శ్రీ వినాయకరావు విద్యాలంకార్, శ్రీ ఫూల్‌చంద్ గాంధి. వీరుగాక ప్రధాని యం. కె. వెల్లోడి, యం. శేషాద్రి, సి. వి. యస్. రావు, నవాబ్ జైన్ యార్ జంగ్ బహదూర్ గార్లు నలుగురు పాత మంత్రులతో సహా మొత్తం మంత్రుల సంఖ్య ఎనిమిది.

లాయక్ అలీ కుటుంబసమేతంగా పాకిస్తాన్‌కు పరారి కావడంతో కాని సంస్థానపరిపాలనా వ్యవస్థలో మార్పు తేవాలనేభావం భారతప్రభుత్వానికి కలగలేదు. కమ్యూనిస్టుసమస్య సరిగా పరిష్కారం కాకపోగా ప్రజలలో అసంతృప్తి కలిగి, పూర్వమహమ్మదీయరాజ్యాంగ నాయకుల ప్రాబల్యం మళ్లీ పెరిగిపోవడంతో లాయక్ అలీ సులువుగా అందరికళ్లలోనూ కారంకొట్టి పారిపోగలిగాడు. ప్రభుత్వోద్యోగిని తెచ్చి ప్రధానమంత్రిగా కూచోబెడితే భారత ప్రభుత్వ హోంశాఖ తెలంగాణాలో కమ్యూనిజాన్ని అణచగలరనుకున్నారు. కాని అదీ జరగలేదు. ఇప్పుడు కమ్యూనిస్టుల అరాచక చర్యలంత ఉధృతంగా లేవంటే కారణం ప్రభుత్వబలప్రయోగం కాదు. జిల్లా మేజస్ట్రేట్ల ఉత్తర్వుల్తోగాని న్యాయవిచారణతోగాని నిమిత్తంలేకుండా కమ్యూనిస్టులని అనుమానించినవారిని కాల్చిచంపడంవల్ల కమ్యూనిజం అణిగిపోయేది కాదు. ప్రజల అసంతృప్తే కమ్యూనిజానికి ఆధారం. ఆ అసంతృప్తిని నివారించడానికి వెంటనే ఎన్నికలు జరిపి ప్రజాప్రతినిధులతో ప్రభుత్వం నిర్మించవలసిన అగత్యం ఇంకా ఢిల్లీలోని అగ్రనాయకులికి పొడగట్టలేదు.

ఆపైనకూడా ప్రజల అసంతృప్తి తీరుతుందనే నమ్మకం లేదు. మచ్చుకి మన చెన్నరాష్ట్రమే చూడవచ్చును. కాని ప్రజాప్రతినిధుల ప్రభుత్వం ఏర్పడినట్లయితే ఒక ముఖ్యప్రతిబంధకం తొలగిపోతుంది. ప్రజల అసంతృప్తికి కల హేతువుల్లో ఒకటి నివారణకాగలదు.

ఇప్పుడేర్పడిన ద్వంద్వాధికారప్రభుత్వం ఆట్టే సమర్థించి సమస్యల్ని పరిష్కరించగలదనే నమ్మకం ఎవరికీ లేదు.

వీరు చేయగలిగేదల్లా ఒక్కటే. ఎన్నికలకి సంస్థానాన్ని సిద్ధపరచడం. అటు భారతప్రభుత్వం సంస్థానశాఖవారి ఆజ్ఞల్ని పాటించి ఇటు సంస్థానకాంగ్రెస్ ఆశయాల్ని పాటించి మంత్రివర్గం ద్వంద్వాధికారంకింద నిర్వహించుకోవాలి. ఇందులో సంస్థాన కాంగ్రెస్‌కి కాంగ్రెస్‌మంత్రులపైన ఏలాటి మదుపు ఉండదు. కాబట్టి ఈ కాంగ్రెస్ మంత్రుల్ని నియమించినంతమాత్రాన పరిపాలనలోగాని, ప్రజల స్థితిలోగాని మార్పేమి ఉండదనేది రూఢి. లాయక్ అలీ పరారీవల్ల బయటపడిన ప్రభుత్వఅసమర్థతను కప్పిపుచ్చుకోడానికి, కాంగ్రెస్ ప్రభుత్వం కావాలనేవారి కన్నీరు తుడవడానికి ఈ మంత్రుల్ని నియమించారు. ఇటువంటప్పుడు తెలంగాణాకాంగ్రెస్‌వారు అర్హులైనవారిని మంత్రులుగా నియమించలేదని అనడం నిరర్థకం. నిష్ప్రయోజనమైన పదవులకు ఎవరు నియమితులైనా ఒకటే.

## రైతుల రక్షణ *

హైదరాబాద్‌లో రైతుల స్థితిని బాగుపరిచి, వ్యవసాయోత్పత్తిని వృద్ధిపరచడానికిగాను విచారణసంఘం నివేదికల్ని వెల్లోడీగారి ప్రభుత్వం ఆమోదించి ఈ నెల పదవతేదీ నుంచి అమలులోకి తెచ్చారు. విచారణ చేసినవారు పూర్వ మైసూరుదివాన్ యన్. మాధవరావు, హైదరాబాద్ ప్రభుత్వోద్యోగి గులాం హైదర్, నిజాం కళాశాలాధ్యాపకులు డా॥ ఆర్. వి. రావుగార్లు.

ఈ రైతురక్షణశాసనప్రకారం రైతుల కౌలు రక్షించబడుతుంది. భూమి యజమానులు స్వయంగా వ్యవసాయం చెయ్యని పక్షంలో ఈ జూన్ పదవతేదీని ఏ రైతు ఆభూమిలో సేద్యం చేస్తున్నాడో, ఆ రైతుకు ఆభూమిపైన సేద్యపు హక్కు శాశ్వతంగా ఏర్పడుతుంది. ఆరైతువంశానికి పారంపర్యా సేద్యపు హక్కు సంక్రమిస్తుంది. రైతుని కౌలునుంచి తొలగించే అధికారం యజమానికి ఉండదు. మూడేళ్లలో, అనగా 1953 జూన్ 10 వ తేదీకల్లా భూమిఅంతా సేద్యం చేసేవారి ఆధీనంలోకి రావాలి. యజమానలు భూమి అమ్మకోవాలంటే, రైతు కొనదలిచేపక్షంలో ఇతరులకి అమ్మకూడదు. రైతు తన కౌలు పట్టాని ఇంకొకరికివ్వాలనుకుంటే తాలూక్దారు అనుమతిని పొందాలి. ఈ కౌలుకట్టుబడులు మూడేళ్లలో పూర్తిచేసుకోవాలని కూడా విధించబడింది. అమరకం పదేళ్ల వరకూ నిర్ణయించుకోవచ్చును. మూడేళ్ళయినతరవాత కౌలుకిచ్చే అవకాశం భూమియజమానులకివ్వబడదు. కౌలుషరతుల్లో రైతులు చెల్లించవలసిన మక్తాలకు కూడా హద్దు నిర్ణయించబడింది. ఇరిగేషన్ సదుపాయాలున్న భూమికి ఫలసాయంలో మక్తా మూడోవంతుకి మించకుండా, ఇతరభూములకు నాలుగో వంతుకి మించకుండా ఉండాలి.

భూమియజమానులు, రైతులు తమ యాజమాన్యంక్రింద ఉంచుకోగలిగే భూమికి కూడా పరిమితి విధించబడుతుంది. నెలకి 150 రూపాయల ఆదాయం తెచ్చే భూమి కనీసావసర ప్రమాణంగా పరిగణించి, ఇంతకు పదిరెట్లకంటె భూమి ఏ ఒక్కరి ఆధీన



శ్రీ బూర్గుల రామకృష్ణరావు



శ్రీ ఎం. కె. వెల్లోడి



శ్రీ సి. వి. ఎస్. రావు

# హైదరాబాద్ నూతన మంత్రివర్గం



శ్రీ వల్లూరి బసవరాజు



శ్రీ ఎం. శేషాద్రి



శ్రీ ఫూల్ చంద్ గాంధీ



శ్రీ నవాబ్ జైన్ యార్ జంగ్



శ్రీ వినాయకరావు విద్యాలంకార్

ములో ఉండరాదని నిర్ణయించబడింది. సంస్థానంలో ఎందుకూ కొరగాని గుట్టల భూమి, బీడుభూమి మొదలు మేరుపెనగ, పొగాకు, అపరాలు, ప్రత్తి పండే మేలైన భూమివరకూ అన్నిరకాలూ వున్నాయి. అందువల్ల పై ఆదాయపరిమితినిబట్టి ఏ మండలంలో ఎంతెంత భూమిని హద్దుగా పరిగణించాలో ఉత్తరోత్తరా నిర్ణయించబడుతుంది. దీని ప్రకారం గరిష్ఠప్రమాణం ఏభయ్యేకరాల మొదలు 350 ఎకరాల వరకూ కూడా ఆయా ప్రాంతాల్లో నిర్ణయించబడవచ్చును.

ఈ శాసనంవల్ల పెద్ద పెద్ద జమీందారీలు, రద్దుకావచ్చును. రైతులకు తప్పకుండా రక్షణ లభిస్తుంది — ఏడాదిలోగా వారిని యజమానులు గెంటెయ్యకుండా ఉంటే.

## ఆంధ్ర కాంగ్రెస్ ఎన్నికల నిలుపుదల *

ఫిర్యాదుల విచారణపైన ఫిర్యాదుల్ని విచారించడం కోసం ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాల్లో ఎన్నికల తతంగాన్ని అఖిల ఇండియా కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ పట్టాభి గారు నిలుపుదలచేస్తూ ఆజ్ఞ ఇచ్చారు. రిటర్నింగ్ ఆఫీసర్ల నియామకం, నామినేషన్ల బాగోగుల నిర్ణయం, సక్రమంగా జరగలేదనీ, రాష్ట్ర కాంగ్రెస్ పక్షంవారు, మంత్రివర్గ పక్షంవారికి అన్యాయం చేశారనీ అఖిల ఇండియా కాంగ్రెస్‌వారి ఎలక్షన్ సబ్‌కమిటీకి కట్టలుగా ఫిర్యాదులు మామూలు పోస్టు ద్వారా, తంతులద్వారా, మనుషులద్వారా వెళ్ళినందువలన వీటిని విచారించడానికిగాను గోకుల్భాయిభట్ గారు నియమితులైనారు. వారు రెండునెల్ల క్రితం విజయవాడ వచ్చి [illegible] చెన్నపట్టంవచ్చి విచారణచేశారు. భట్ గారిని నియమించినసమయంలోనే పశ్చిమబెంగాల్, బీహార్ రాష్ట్రాలనుంచి కూడా వచ్చిన ఫిర్యాదుల సంగతి తేల్చబడింది. పశ్చిమ బెంగాల్లో ఎన్నికలకి పర్యవేక్షకులుగా కళా వెంకట్రావుగారు నియమించబడ్డారు. బీహార్‌లో ఫిర్యాదుల్ని విచారించే బాధ్యత తమకు లేదనీ, తుది నిర్ణయం బీహార్ రాష్ట్ర కాంగ్రెస్ వారిదేననీ తెలుపుతూ వెంకట్రావుగారు కార్యదర్శి హోదాలో పాట్నాకి టెలిగ్రాం పంపారు. ఆ టెలిగ్రాము ప్రమాదవశాత్తు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయానికి చేరింది. దాంతో రంగాగారు బీహారు కొక నియమం ఆంధ్రరాష్ట్రానికొక నియమమూ కూడదని విమర్శించారు. కాని భట్ గారు కొంచెం అనుకూలంగా కనపడగానే రంగాగారు చప్పున ఊరుకున్నారు.

భట్ గారు ఢిల్లీ చేరిన ఫిర్యాదుల కట్టలు మోయించుకుని విజయవాడ వచ్చేసరికి ఇక్కడ మరిన్ని కట్టలు పోగైనాయి. వీటినన్ని విచారించి ఫిర్యాదుచేసిన చోట్లల్లా ఉభయపక్షాలవారూ కలిసి దాఖలైన నామినేషన్లు తనిఖీచెయ్యాలని తీర్పు చెప్పారు. రాష్ట్రకాంగ్రెస్‌వర్గానికి పూర్తిగా వ్యతిరేకులైన పశ్చిమగోదావరి, గుంటూరు జిల్లా కాంగ్రెస్‌లలో చాలవరకు రాష్ట్రకాంగ్రెస్ వారి రిటర్నింగ్ ఆఫీసర్లనే ఖాయంచేసి మళ్లీ నామినేషన్లు దాఖలు చేసుకోవాలని తీర్పు ఇచ్చారు.

ఒకవంక విచారణ జరుగుతూనే వుంది. మరొకవంక నామినేషన్లు దాఖలు చెయ్యడం, రికార్డు లెత్తుకుపోవడం కాంగ్రెస్ కార్యాలయాల్లో ఉభయపక్షాలవారూ తాళాలకోసం తగువులాడ్డం, రిటర్నింగ్ ఆఫీసర్లకి అక్కడక్కడ దేహశుద్ధి చెయ్యడం జరిగిపోతూనే ఉన్నాయి. ఇంక పల్లెటూళ్లలో పండగలకి కోడిపందేలాడేవాళ్ళనీ, స్కూళ్లలో మేష్టర్ల మీద తిరగబడి కుర్చీలూ బల్లలూ బద్దలు కొట్టే పిల్లకాయల్నీ ఆకతాయులని ఎలా అనడం? వారి తంతుల్నికూడా ఇకనించి రాజకీయాలనడం మేలు.

భట్ గారిని విచారణకు నియమించింది లగాయితూ వారిని అంటకాగిఉన్న రంగాగారికి దొరికిన లాభాన్ని కాస్తా ఎగరగొట్టెయ్యడానికి క్షణం పట్టలేదు. అలా క్షణంకూడా పట్టదని కళావారిపక్షంవారు ముందునంచీ చెప్తూనేఉన్నారు. వారి తప్పేంలేదు. కాంగ్రెస్ పంచాయతీ ఎన్నికల కథన మరికొన్నివారాలు నడుస్తుంది. ఇంతవరకూ చాటునీ మాటునీ తిట్టుకొని కొట్టుకోడానికి చేతులెత్తకోడంవరకూ వచ్చినది. ఆతరవాత అధ్యాయంలోకి దిగడానికి చాలినంత వ్యవధి దొరికింది.

## రైల్వేల నిర్వహణ: *

మనదేశంలో రైల్వేల నిర్వహణ బాగుందని ఎవ్వరూ అనరు. పద్ధతి మార్చాలని అందరూ అంటారు.

రైల్వేలవల్ల ఒనగూడవలసిన సౌకర్యాలు మూడు. 1. వర్తకవ్యాపారాలకి. 2. అవసరమొచ్చినప్పుడు సైన్యాలు పోలీసుదళాల రవాణాకి. 3. ఉద్యోగపుటూళ్లకి, వ్యాపార నిమిత్తం, బంధువుల దర్శనార్థం, పెళ్లి వారి తరలింపులకి ప్రజల రవాణాకి.

వీటిలో ఏ సౌకర్యాన్ని బట్టిచూసినా ఇప్పుడున్న పద్ధతి కాని సూచించబడుతున్న పద్ధతి కాని ప్రయోజనంఅట్టేఉండదనితట్టుతుంది.

కమ్యూనిస్టులికి తెలియకగాని రాయలసీమలో ఉద్యమాన్ని ఆరంభిస్తే వారిని అడ్డేవాళ్లుండరు. ఏమూల ఏం జరిగినా పోలీసుల్ని కాని సైనికుల్ని గాని తీసుకుపోవాలంటే ఎటుచూసినా ఆకాశం అంచుదాకా బోగులు బోగులుమనే రాళ్లగుట్టలమధ్య ఎగుడుదిగుడు నేలమధ్య లారీల్లో తీసుకుపోవలసిందే. కొన్ని కొన్నిచోట్ల నడిచిపోవలసిందే కాని రైలుదారిలేదు.

రాయలసీమకీ సర్కార్లకీ ఎడముఖం పెడముఖంగా ఉందంటే. వివాహసంబంధాలు చేసుకోడానికి రైళ్ల రవాణాసౌకర్యం లేకనే నన్నారొకరు. పాసింజర్లు టపాబళ్లు, గుడ్స్‌బళ్లు ఎన్నెన్ని ఎప్పుడెప్పుడు నడపాలో నిర్ణయించే ముందు యావదాంధ్రదేశసౌకర్యాల్నీ గమనించవలసిన అవసరం ఉంది.

ఈ విషయంలో ప్రజల అభిప్రాయాన్ని ప్రభుత్వం తెలుసుకుంటుంది. ఆంధ్రదేశంలోని మీటర్ గేజ్ అంతా దక్షిణాదిమండలానికీ పశ్చిమాన ఉన్న బ్రాడ్ గేజ్ లైనూ, విజయవాడకి ఉత్తరాన ఉన్న బ్రాడ్‌గేజి లైను తూర్పు మండలానికీ ఇస్తే అది ఆంధ్రదేశానికి ఎంతవరకూ సౌకర్యమో, ఎంత అసౌకర్యమో వర్తకులు ప్రభుత్వానికి తెలపాలి.

[సీతారామ్]

THIS Lovely WATCH FOR
Rs.15/-
SWISS MADE GTD. 3 YEARS.
CHROME CASE 15/-
GOLD GUILT CASE 17/-
CENTRE SECOND 18/-
GOLD GUILT 20/-
15 JEWELS CHROME 35/-
FREE INDIA WATCH CO.
POST BAG No. 6724. CALCUTTA 7.

# ప్రపంచం

## శాంతియత్నాలు *

ప్రపంచంలో 20 ఏళ్లపాటు అన్ని దేశాల మధ్యనూ శాంతిని కాపాడ్డానికి ఐక్యరాజ్యసమితి ప్రధానకార్యదర్శి ట్రిగ్వేలీ పది అంశాల కార్యక్రమా న్నొకదాన్ని సూచించారు. పారిస్, లండన్, మాస్కో, వాషింగ్టన్ నగరాల్లో అగ్రరాజ్యాధిపతులను కలుసుకున్నప్పుడు ఈ కార్యక్రమాన్నే ట్రిగ్వేలీ సూచించారట.

చీనా కమ్యూనిస్టు ప్రభుత్వసభ్యత్వసమస్యపై ఏర్పడిన ప్రతిష్టంభనమూలంగా ఐక్యరాజ్యసమితి భగ్నమైపోయే ప్రమాదం ఆసన్నమయింది. రష్యా, తూర్పుయూరప్ ప్రభుత్వాల ప్రతినిధులు సర్వసభ్యసమితి, యూరోపియన్ ఆర్థిక సాంస్కృతిక విద్యాసంస్థలను తప్ప మిగతా సమితిశాఖలన్నిటినుంచీ నిష్క్రమించారు. భద్రతామండలినుంచి రష్యన్ ప్రతినిధి నిష్క్రమించాడు.

కాశ్మీర్ సమస్యపై చర్చ జరిగినప్పుడు, సర్ ఓవెన్ డిక్సన్ మధ్యవర్తిగా నియమించబడినప్పుడుకూడా భద్రతామండలిలో రష్యన్ ప్రతినిధి పాల్గొనలేదు. వచ్చే సెప్టెంబర్‌లో సర్వసభ్యసమావేశం లేక్‌సక్సెస్‌లో జరుగుతుంది. చీనాసభ్యత్వసమస్యవల్ల ఈ సమావేశంనుంచికూడా రష్యా జెకొస్లోవాకియా మొదలైన కమ్యూనిస్టు దేశాల ప్రతినిధులు నిష్క్రమించారంటే ఇంక సమితి భగ్నమైపోయినట్లే.

సభ్యత్వసమస్యను పరిష్కరించవలసినది భద్రతామండలి. ఈ మండలికి, జూన్‌లో భారత ప్రతినిధి జూలైలో నార్వే ప్రతినిధి అధ్యక్షత వహిస్తారు. ఆగస్టులో రష్యన్ ప్రతినిధిఅధ్యక్షుడవంతు. కాబట్టి సెప్టెంబర్ సర్వసభ్యసమావేశం జరిగేలోగా ఈ సమస్యను పరిష్కరించి సమితిని కాపాడాలంటే జూన్ జూలైమాసాల్లో పరిష్కారమైపోవాలి.

ఇప్పుడు ప్రతిష్టంభనకు హేతువు చీనా ప్రాతినిధ్యసమస్యే అయినప్పటికీ, ప్రపంచంలో శాంతిని కాపాడాలంటే ఆంగ్లో అమెరికన్ వర్గానికీ రష్యన్ వర్గానికీ మధ్యగల వివాదాంశాలన్నిటినీ పరిష్కరించాలి. నిరస్త్రసమస్య, ఏటంబాంబుల నిషేధసమస్య, జర్మనీ, జపాన్‌లలో శాంతిసంధిసమస్య మొదలైనవి పరిష్కారమవాలి.

కాబట్టి ట్రిగ్వేలీ పదిఅంశాల కార్యక్రమాన్ని సూచించి, ఈ కార్యక్రమాన్ని ఇరవైయేళ్లు అనుసరించినట్లయితే ప్రపంచంలో శాంతి స్థిరంగాఏర్పడుతుం దన్నారు. ఈ పదిఅంశాలలో ముఖ్యమయినవి 1. ప్రతియేటా భద్రతామండలి తరుచు యూరప్‌లో సమావేశమౌతూఉండాలి. ఈ సమావేశాలకి అగ్రరాజ్యాల తరఫున ఆ రాజ్యాల విదేశాంగమంత్రులు హాజరవాలి. విదేశాంగమంత్రులు కాక ఇతరప్రతినిధులు హాజరైతే అక్కడికక్కడ వారి ప్రభుత్వాలతరఫున నిర్ణయాలు చేసే అధికారం వారి కుండదు. సమావేశాలు లేక్‌సక్సెస్‌లోనే జరుగుతున్నందువల్ల కొన్ని చిన్న దేశాల్ని అమెరికా లోబరచుకుని మండలిలో బలాధిక్యత సంపాదించి మండలినిర్ణయాల్ని తన ఇష్టం వచ్చినట్లు నడుపుతున్న దనే భావం ప్రబలమౌతున్నది. చీనాప్రభుత్వప్రాతినిధ్యసమస్యలో ఇదే జరిగిందనీ, అమెరికాఒత్తిడి లేనిపక్షంలో బ్రిటన్‌ఫ్రాన్సు దక్షిణ అమెరికా రాజ్యాలూ కమ్యూనిస్టుప్రతినిధిప్రవేశానికి వోటుచేసిఉండేవారనీ రష్యా అభిప్రాయపడుతోంది. ఈ అపోహల్ని తొలగించడానికిగాను యూరోపియన్‌నగరాల్లో సమావేశాలు జరపడం మంచిదని ట్రిగ్వేలీ సూచించాడు.

2. ఏటంబాంబుల నిషేధం ఏటంశక్తి ప్రయోగవిధాననిర్ణయాలగురించి అంతర్జాతీయ నిర్బంధాలపై సమాధానం చేసుకోడం కోసం తిరిగి ఎటామిక్ ఎనర్జీ కమిషన్ సమావేశమవాలి. ఇంతకుముందు రష్యాకి ఏటంబాంబుల తయారీరహస్యం తెలియదని అమెరికా బ్రిటన్‌ఫ్రాన్సులు భావించినందువల్ల ఒక కార్యక్రమాన్ని బాగా సూచించారనీ ఇప్పుడు పరిస్థితి మారిపోయినందువల్ల (అంటే రష్యాకికూడా రహస్యం తెలుసునని తెలిసిపోయినందువల్ల) మళ్ళీ ప్రయత్నం చేస్తే కొత్తకార్యక్రమాల్ని కొత్త పరతుల్ని సూచించడానికి వీలుంటుందనీ, ఇప్పుడు సమాధానానికి అధికావకాశం ఉన్నదని ట్రిగ్వేలీ అభిప్రాయం.

3. సాయుధ బలనిర్ణయసంఘం తిరిగి సమావేశమై ఏ దేశాలెంతెంత బలాన్ని సిద్ధంగా ఉంచుకోవచ్చునో, ఎవరిబలం ఎంతకి మించకుండా పరిమితంగా ఉండాలో ఒడంబడికలు కుదుర్చుకోవాలి.

4. ఆంగ్లో—అమెరికన్ వర్గం, రష్యన్ వర్గంకూడా ప్రవేశపెట్టాలని కోరుతున్న కొత్తరాజ్యాలన్నిటినీ సమితిలో ప్రవేశపెట్టాలి. ఈ దేశాలు మొత్తం 14 ఉన్నాయి.

మిగతా ఆరుఅంశాలు సమితి తలపెట్టిన ఇతరకార్యాలకు సంబంధించినవి. అనగా ప్రపంచఆరోగ్యసంస్థ, అంతర్జాతీయన్యాయనియమనిర్ణయసంఘం, అంతర్జాతీయ పోలీసుదళనిర్మాణం మొదలైన కార్యక్రమాల్ని సమితిలోని రాజ్యాలన్నీ బలపర్చాలని సూచించారు.

ఈ సూచనలపట్ల చిన్నరాజ్యాలన్నీ సుముఖంగా ఉన్నాయి కాని అగ్రరాజ్యాలు అట్టే సుముఖంగా లేవు. స్టాలిన్ ఈ శాంతిసూచనలపట్ల చాలా శ్రద్ధ కనపరిచినట్లు ట్రిగ్వేలీ అన్నారు. అయితే ఓటు వ్యతిరేకంగా వచ్చినంతమాత్రాన సమితి సంస్థలనుంచి నిష్క్రమించడం నీతికాదని రష్యన్ వర్గాన్ని ట్రిగ్వేలీ విమర్శించారు.

ఇన్ని అంశాల శాంతిసాధనకార్యక్రమాల్ని తలపెట్టినా అమెరికారష్యాలు తమతమ కార్యక్రమాల్నీ విదేశాంగనీతినీ మార్చదలచలేదని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఉభయులమధ్యను సఖ్యత చేకూర్చాలని ప్రయత్నిస్తున్న ట్రిగ్వేలీ పట్ల ఉభయులకూ నిరాదరణ కలిగింది.

(39 పేజీ చూడుడు)

గనోక్యూర్
అన్ని సెగరోగాలకు గంటలలో గుణము
ఈశ్వర ఫార్మసీ, రాజమండ్రి

నవల:




## శ్రీ నోరి నరసింహశాస్త్రి

## 3౮

జన్నిగసేనలు కొప్పెరుంజింగని సేనలను తాకెను. ధీరగంభీరమైన యీ యాంధ్రసేనల తాకునకు కాడవసేనలు దడదడలాడిపోయెను. "ఏమిది? దురుసుదనము లేని యీ వాహినితాపు మన సేనల నింత యల్లజడిపరచిన దేమి? అశ్వములు బెదరిపోయినవి. గజములు చెదరినవి. పదాతులు చిందర వందర యయినారు. ఏమిది?—ఇట్లనుచు కాడవసేనానులు చీకాకుపడిరి.

కాని యుద్ధానుభవముగల యీ సేనానులకు వెంటనే కారణము తత్ప్రతిక్రియయు స్ఫురించినవి. 'ఇది పర్వతములవంటి గజముల తాపు! దీనికి ఎదురు నిలిచిన లాభము లేదు. చురుకుగ తప్పించుకొనుచు ప్రక్క వేటులు సాగింపవలెను" ఇట్లాలోచించి, సుశిక్షితులగు వారి సైనికులకు జన్నిగసేనల నెదురొడ్డు నుపాయములతో నూతనాజ్ఞలు ప్రవర్తింపజేసిరి.

ఆ సేనలును జాముప్రొద్దెక్కునప్పటికి నిలువద్రొక్కుకొనెను. మరికొంతసేపటికి ఎదురుదెబ్బ తీయు నేర్పలవరచుకొనెను. ఈ విధముగా రెండుమూడు క్రోశముల వెడల్పుగల మేరను ఆ రెండు సేనలును తలపడి పోరుచుండెను.

ఆ సమయముననే ఆవల సముద్రముపై యుద్ధము సాగుచుండెను. కోగంగినుండి వచ్చిన కాకతీయనావలును బలమున గజములనే యనుకరించుచుండెను. గజయూథములవలెనే అవియు ధీరగంభీరగమనముతో మొగలితుర్రువారేవుపైకి సాగుచుండెను. చిన్నవగు చోళనావలు ఆ నావల సందులనుండి తప్పించుకొని వెనుకకు చేరవలెనని ప్రయత్నింపసాగెను. కాకతీయనావల మొదటివరుసలో పెద్ద సందులు గలవు. ఆ సందుల మధ్యలనుండి చోళనావలు వానిని దాటిపోవ బయలుదేరెను.

ఎదురుగా నున్నంతవరకు వానిని కాకతీయనావ లేమియు జేయక యూరకొనెను. దానితో చోళనావలకు ధైర్య మెక్కువయ్యెను. ముందుకు సాగి యవి నెమ్మదిగా కాకతీయనావల మొదటి శ్రేణి మధ్యకు చేరుకొనెను.

అంతవరకు నిదురపోవుచున్నట్లున్న కాకతీయనావలు ఒక్కసారిగా నుద్బుద్ధము లయినట్లయినవి. పెద్దనావలు కదలునప్పుడు జలములో "ఓటు" లేచును. అది పెద్ద వడివల్ల కలుగు ప్రవాహవేగము. ఆ ఓటులో చిన్న నావలు నిలువలేవు. తమ నావల కదలికచే పుట్టు ఓటు శత్రునావలను ముంచివేయువిధముగా కాకతీయనావలు దగ్గరకు చేరికొనసాగినవి. ఆ కదలికతో సముద్రములో లేచిన ఓటుకు చోళనావలు కొన్ని గిరగిర తిరిగి మునిగినవి. కొన్ని నిలువలేక యిటునటు కొట్టుకొనుచున్నవి. వానిని నిలుపబట్టుకొనుట చోళనావికులకు సాధ్యమగుటలేదు. అంతలో కాకతి నావలనుండి ధనర్ధరులు శరప్రయోగము చేసి యీ నావికులను అందలి యోధులను నొప్పింపసాగిరి. చోళనావలలోని ధానుష్కులు బాణమోచనము చేయుట కనువుగా వారికి నావల కదలికచే కాలూనుట లేదు!

ఇట్లు పలునావలు బాధపడినను ఏవో కొన్ని చోళనావలు మొదటి శ్రేణిలోని కాకతీయనావల సందులనుండి యావల బడినవి. కాని చిత్రముగా ఆ సందులకు ఎదురుగా సూటిగా కాకతీయుల రెండవశ్రేణినావ లున్నవి. అవి యీ చోళనావలను తాక నవసరమే లేకపోయినది. వాని దగ్గరకు వచ్చినంతనే, లేచిన సముద్రపు ఓటుకు చోళనావలు తలక్రిందు లైనవి. ఇట్లానాడు చోళనావలు చేసిన మొదటి ప్రయత్నము వ్యర్థమైనది.

పాటుసమయము చోళనావల కనుకూలము. అట్టిపాటువేళ చేసిన ప్రయత్నమే యిట్లు వ్యర్థమైనది. ఈనాడు ఏకాదశి గనుక జాము ప్రొద్దెక్కిన పిమ్మట పోటు ప్రారంభించును. ఆ సమయమున దుష్ప్రయత్న మసలే ఫలింపదు. మూడుజాములవరకు మరల పాటకు తిరుగదు. అంతవరకును చోళనావలు ఆత్మరక్షణకు తప్ప తాముగా పోరు సాగించుటకు మరి యెట్టి ప్రయత్నమును చేయక మానుకొనెను. అవియు కాకతీయనౌకాయుద్ధవిధాన మవగతము చేసికొనెను. అందుచే నప్పటినుండి యవి కాకతీయనావల సందులకుమాత్రము పోక, ఎదురు వచ్చుచున్నట్లే యుండి, ప్రక్కలకును వెనుకకును జరుగుచు చురుకుగా సంచార మొనర్చుచు కాకతీయ నావలను, అక్కడ నొకవ్రేటు ఇక్కడ నొకవ్రేటు, వేయుటకు ప్రయత్నించుచుండెను!

ఇట్లు కాడవసేనలును ఆంధ్రసేనలును నేలమీదను సముద్రము మీదను మహాయుద్ధములు చేయుచున్నవి. అట్టి సమయమున కొప్పెరుంజింగడు తన శిబిరములో శ్రద్ధగా ఏకాదశీమహోత్సవము సాగించుచుండెను. ఆ శిబిరమునకు తూర్పున వసిష్ఠగోదావరియే యగడ్తగా నున్నది. మిగిలిన మూడుదిక్కులను తాత్కాలికముగా చిన్నకోటవలె కట్టి బలిష్ఠమగు సేనలు కాపున్నవి. [illegible]

లకు ప్రత్యేకముగా నాహ్వానింపబడినవారు తప్ప దానిలోని కెవ్వరికిని చొరనను మతి లేదు. ఆ శిబిరముకూడను మనోజ్ఞములగు చిత్రచిత్రవర్ణములు గల పటకుటీరములతో చిన్న నగరమునే యనుకరించుచుండెను.

మహారాజసింహాపరనాముడగు నా కొప్పెరుంజింగడును, ఆనాడు బ్రాహ్మముహూర్తముననే మేల్కాంచెను. అతని పూర్తి పేరు, 'అవనియాళప్పిరంద కొప్పెరుంజింగదేవుడు.' దీనికి అర్థము "అవని నేల బుట్టిన రాజు పెదసింగదేవుడు." ఇతని సంస్కృతశాసనములలో నది "అవన్యవనోద్భవమహారాజసింహ"యను రూపము ధరించినది. ఆ శాసనములలో "సకలభువనచక్రవర్తి, క్షీరాపగా దక్షిణనాయక, పెన్నానదీనాథ, కావేరీకాముక" ఇత్యాది బిరుదములును గలవు. మరియు నాతనికి చిదంబరేశ్వరునియందు భక్తి మిక్కుటము. అక్కడి ముగ్గురు నటరాజులలో నాతనికి కనకసభాపతి యిష్టదైవము. అందుచే నాతడు "కనకసభాపతి సర్వకార్య సర్వకాలనిర్వాహక" అను బిరుదమును సగర్వముగా వహించెను. అతడు మరియు "ఖడ్గమల్ల, నిశ్శంకమల్ల, వాల్ బలప్పెరుమాళ్, భరతమల్ల, సాహిత్యరత్నాకర" ఇత్యాది బిరుదనామములుగూడ ధరించెను. ఈ బిరుదములే యాతని స్వభావములోని సర్వతోముఖతద్యోతక మొనర్చును.

ఆవల, తనకు సమీపముననే, తన సేనానులు నేలమీదను నీటిమీదను రెండు మహాయుద్ధములు సాగించుచుండిరి. తాను స్వయముగా శత్రుదుర్గగర్భమునకు చొచ్చుకొని వచ్చియున్నాడు. ఎక్కడనే యపాయము దాగుకొని యున్నదో! అయిన నేమి? తాను తన సేనానులకు సర్వవిధములగు నాజ్ఞలును ప్రవర్తింపజేసి యుండెను. ఆవల నెట్టి యలజడియు లేని సమయముననుండెనే మన శ్శాంతితోడనే, ఆ మహారాజసింహు డీనాడు ముక్కోటి ఏకాదశిమహోత్సవము తన శిబిరములో జరుపుచుండెను. సాహిత్యవ్యసనితయు కళావ్యసనితయు గలవారికే అట్టిని సాధ్య మగును. మహాయోధు లెట్టి సందడియందును శాంతము వహింపగలుగుదురు.

సామాన్యముగా కొప్పెరుంజింగని పురోహితుడే యాతని యిష్టదైవమునకు నిత్యపూజ చేయును. ఈనాడు మహాపర్వమైనందున, నాతడు పురోహితుని బ్రహ్మస్థానమున గూర్చుండజేసి, తానే స్వయముగా కనకసభాపతినటరాజపూజ నిర్వర్తించుచుండెను. అప్పు డాతనిని ద్రావిడకేరళకర్ణాటదేశాగతవిద్వాంసులెందరో పరివేష్టించి యుండిరి. మరియు గోదావరీతీరవాసులగు నాంధ్రపండితు లెందరో ఆ పరిషత్తుకు ఆహూతులై వచ్చి యలంకరించియుండిరి. ఆ యుదయమున పూజావైభవము శ్రోత్రియాతిశయముతో నొప్పారెను. రుద్రాభిషేకము సర్వసంపన్నముగా జరిగెను. మంత్రపుష్పసమయమున ద్రావిడాంధ్రకేరళకర్ణాటపండితులు ఒకరితో నొకరి స్వరములు కలిపి శ్రావ్యముగా వేదమంత్రములు పఠించిరి. అచ్చట నందరకు నభేదభావమే గోచరమయ్యెను. పూజావసానమునకు ముందుగా అక్కడ మంటపమున నావాహితుడైన చిదంబరేశ్వరుని సమక్షమున ప్రాతఃకాలపూజాంగముగా వేదవేదాంగశ్రవణము ప్రవర్తిల్లెను. అందును అందరును నొకే విధమున ననోజ్ఞన్యసహకారముతో మెలగిరి. ఇంత దూరదూర దేశముల నుండి సమాగతులై, [illegible] సమావిష్టులైన ఆ పండితోత్తము లైక్యము వేదవేదాంగములలో ఒకేవిధముగ ప్రవర్తించెను. ఆపిమ్మట శాస్త్రార్థములు సాగినవి.

వేదార్థప్రవచనమును వేదాంతచర్చయు సాగినది. ఆ వెంటనే యక్కడిపండితులు ముత్తెరగులైరి. ఆ భేదమును ఆంధ్రద్రావిడాది దేశభేదమున వచ్చినది కాదు. ఆసేతుహిమాచలము పవిత్రకర్మభూమిగా నెంచువారికి, ఈమధ్య నవాంతరదేశాభిమాన మేమి? వారి కట్టి భేదము లేనే లేదు. వారి కున్నది మతభేద మొక్కటే.

రాజసింహునితో వచ్చిన పండితులలో కొలదిమంది శ్రీవైష్ణవులు, కొందరు శైవులు, పెక్కురు స్మార్తులు. గోదావరీతీరపండితు లెక్కువభాగము స్మార్తులే. వైష్ణవమును శైవమును అక్కడికింకను ఎక్కువగా ప్రాకియుండలేదు. కాని వారిలో గూడ శ్రీవైష్ణవులును శైవులును గలరు. కాని యా ప్రాంతముల ప్రబలురగు ఆంధ్రస్మార్తపండితులతో వారు సామాన్యముగా వివాదమునకు సాహసించువారు కారు. వివాదగ్రస్తము కాని భాగముల వ్యాఖ్యానములతోడనే సభలలో సరిపెట్టుకొని, వారి యంతేవాసులకు పాఠప్రవచనములలో మాత్రమే వివాదభాగములు వివరించువారు.

కాని యీనాడు దక్షిణదేశాగతులైన నూతనశ్రీవైష్ణవపండితుల యండ చూచుకొని, యీనాటి సభలో నాంధ్రశ్రీవైష్ణవులు విజృంభించిరి. ఆ సభలో వివాదము ముందు ఎత్తుకొన్నదే ఆంధ్రశ్రీవైష్ణవపండితులు! వారి వాదమును ద్రావిడశైవపండితులు ఖండించిరి. వెంటనే ద్రావిడశ్రీవైష్ణవపండితు లందుకొని, శైవులను నిందించుచు, మధ్య స్మార్తులపై గూడ కొన్ని విసరులు విసరిరి. ఒక్కసారిగా, నాంధ్రకేరళద్రావిడకర్ణాటస్మార్తపండితులు వారుభయులమీద నేకధాటిని విజృంభించిరి. అది యొక రణరంగమే యయ్యెను. ఈ రణము రెండుముఖములుగా గాక మూడుముఖములుగాను మధ్య ద్వైతులు కూడిన నాలుగుముఖములుగాను సాగిపోవుచుండెను.

ఏ పక్షమున వాదించువారైనను వేదవేదాంగవిదులే వానియందు పరమప్రామాణ్య మున్నవారే; అందరును కుశాగ్రబుద్ధులే! బహుసభల వాదించిన యనుభవ మున్నవారే! ఒకరి యుక్తికంటె నొకరి యుక్తి బలవత్తర మనిపించుచుండెను. స్థూలబుద్ధితో విచారింప శ్రుతివాక్యములకు పరస్పరవైరుధ్య మున్నట్లు భాసించును. వారందరకు నన్నియు పరమప్రమాణములే. ఆ వాక్యముల నన్నిటిని సమన్వయము చేసి, వానికి ఏకవాక్యత కూర్చుటలో, ఈ మతభేదములు వచ్చినవి. ఒక్కొక్కరికి ఒక్కొక్క శ్రుతియందు గాఢాభిమానము. దానినిబట్టి వారు మిగిలిన శ్రుతివాక్యముల యర్థము సమన్వయింతురు. ద్వాపరయుగాంతముననే భేదభావము లుదయించెను. అట్టివాని నెల్ల వారించుచు, జైమినియు బాదరాయణుడును, ధర్మసూత్రములను బ్రహ్మసూత్రములను నిబంధించిరి. ఆ సూత్రముల నూతగొని వచ్చుచుండగా, మరల మతభేదము లంకురించినవి. బ్రహ్మసూత్రములకు సంబంధించినంతవరకు, నట్టి వెల్ల నీదల వారించి, శ్రీవిద్యాశంకరులు ప్రస్థానత్రయభాష్యములు నిబంధించిరి. మరల నిప్పటికి నూటయేబది రెండువందల సంవత్సరముల క్రిందటినుండియు విశిష్టాద్వైతభాష్యములు, శివాద్వైతభాష్యములు, ద్వైతభాష్యములు వెలసి శాంకరభాష్యములను ఖండింపసాగినవి. అట్టు ఖండించువారిని, శంకరులకు పూర్వులుగ వృత్తికారు

లును, వ్యాసజైమినులకంటె ప్రాచీను లగు కపిలగౌతమాదులును, ఆధారభూతు లగుచుండిరి. కాని యొక చిత్రము! శాంకరమతానుయాయుల సంఖ్యాబల మెక్కువ. ఇతరమతస్థులను ప్రధానముగా శాంకరమతమునే ఖండించుచుండిరి. శ్రీమద్రామానుజుల శ్రీభాష్యములో శాంకరమతము ఖండించుటకు ముందు శాంకరమతనిర్వచనమునకే చాలగ్రంథము నడచినది. ఇట్లు పండితసభలలో మహాయుద్ధములే యా కాలమున ప్రవర్తిల్లుచుండెను.

అట్టి మహాయుద్ధమే, యీనాడు కొప్పెరుంజింగని పూజావసానసమయమున, కనకసభాపతి నటరాజస్వామియాస్థానమున గూడిన పరిషత్తులో, ప్రవృత్తమైనది. వాదప్రతివాదము లన్నియు దేవవాణిలోననే సాగుచున్నవి. కొప్పెరుంజింగనికి సంస్కృతము బాగుగా వచ్చును. నిత్యనైమిత్తికములకు కావలసినంతవరకు మాత్రమే వేదమంత్రము లాతడు చెప్పికొని వల్లించెను. మంచి సాహిత్యవేత్త! సాహిత్యమునకు సన్నిహితమగు భరతశాస్త్ర మతడు తీక్ష్ణముగా నభ్యసించెను. కాని యాతని కితరశాస్త్రములలో గాఢప్రవేశము లేదు. కాని యా పండితులు చేసికొనుచున్న వాదక్రమమును చక్కగా నవగాహనము చేసికొని, సూక్ష్మముగా ననుసరింపగల డతడు. అందుచే నాతడు తన్మయుడై యావాదము లాలకించుచుండెను.

ఈ గోదావరిపండితులు కేవలవిద్వాంసులే కాక స్వయముగా నన స్నాత లగు మహాయజ్వలు. వారు నిత్యము నర్చించు నగ్నిభట్టారకుడు వారి శరీరములం దెల్ల ఆవేశించియుండి, వారి మూర్తులకు తేజస్సు నావహింపజేసెను. వారి బుద్ధులు సూక్ష్మమైనవి; వాక్కులలో మాధుర్యముతోపాటు అచంచల మగు దార్ఢ్య మున్నది. ఎదిరివాదము నొప్పుకొనుచున్నట్లే దూరము సాగించి, యక్కడ మొగ్గవేయింతురు. ఎదిరివారు మోటుగను దురుసుగను మాటాడుచున్నకొలదియు, వారు పరమశాంతముగా నుండి, ఎదిరిమాట తడబాటు పట్టుకొని సాగదీయుదురు. తాము తడబడరు. వెల్లిరాలను నగ్రహారమున కగ్రణి యగు కేతనయు మధ్యమధ్య అందు పాల్గొనుచుండెను.

అంతలో కేతన కొక యూహ తోచినది. అతని కిట్లు కొప్పెరుంజింగడు ఈ పండితచర్చను శ్రద్ధతో నాలకించుచుండుట యెంతయేని ఆనందము కలిగించెను. అందరకు నావల రెండు మహాయుద్ధములు జరుగుచున్న వని తెలియును. అంతి మహాయుద్ధములకు మూలకారణు డగు నీ రాజసింహున కింత నిబ్బర మేమి? ఏమియు నంటనివానివలెనే ఈ పండితపరిషత్తులోని శాస్త్రార్థములు వినుచున్నా డితడు!

“పూర్వము జనకమహారాజు మిథిలాపట్టణమంతయు దగ్ధమగుచున్నను నిర్లిప్తుడై యుండెనట! ఇప్పుడు మరల నీ నాడు ఆ విదేహుని నిర్లిప్తత ఈ రాజసింహునిలో చూచుచున్నాము!”

ఇట్లు కేతన యనెను. దానితో సభయంతయు వికసించెను. రాజసింహుని ముఖవికసనము అతిశయించెను. అది చూచి గోదావరి పండితు లందరు నదియే యందుకొనిరి. వారు ప్రత్యక్షముగా నది ముఖస్తుతిరూపముగా విస్తరింపక, వాదములలో సందర్భవశమున కొప్పెరుంజింగని జనకునితో పోల్చినట్లు ధ్వనింపజేయుచుండిరి. కొప్పెరుంజింగనికి ఆనందము క్షణక్షణ మతిశయింపసాగెను. వీరిని కెట్లు గౌరవించుటా యని పరిపరివిధముల నాలోచించుచుండెను.

మధ్యాహ్నమైనది! అవల యుద్ధములును, రాజసింహునకును జన్నిగకును, కొంతవడి గెలుపుగా కొంతవడి ఓటమిగా నుండెను. ఆ యుద్ధములును గజముల సైర్యమునకును హయముల తీక్ష్ణతకును మధ్య జరుగుచున్న యుద్ధముగనే ఉండెను. ఏవి గెలుచును, గజములా, అశ్వములా?

రాజసింహుని సేనానుల కంతవరకు నాత్మవిశ్వాసము పోలేదు. సముద్రముపైని గాని భూమిమీద గాని, తా మోడిపోదు మేమో యను నాలోచనయే, వారి కంతవరకు లేదు. రాజసింహుని యాజ్ఞ లంతవరకు వారు పాలించుచుండిరి. కాని యిప్పుడు వారికి యుద్ధక్రమము రాజసింహునకు నివేదించుట మంచి దని తోచినది. ముఖ్యసేనాపతులు తమలో తా మాలోచించుకొనిరి. యుద్ధస్థితి సమగ్రముగా రాజసింహునకు తెలిపి, యవసర మగుచో, నూతనాజ్ఞలు పడయుట మంచి దని వారందరు నేకగ్రీవముగా నిశ్చయించిరి. రాజసింహుని నిర్ణయములందు వారికి గాఢవిశ్వాసము కలదు. అట్లే వా రాతనికి యుద్ధరంగమునుండి వార్త యంపిరి.

సేనాపతులు పంపిన వార్తాహరుడు రాజసింహుని శిబిరమునకు వచ్చెను. అతనికి లోనికి రా ననుజ్ఞ రాలేదు. జనకమహారాజు వలె నున్న కొప్పెరుంజింగనికి, మధ్యలో యుద్ధవార్తలు నివేదింప వార్తాహరుడు వచ్చె నని యేని చెప్పుట కెవరు సాహసింతురు? కాళ్లు కాలిన పిల్లులవలెనే పరిచారకులు కొంద రాతనిరాయెదుట తారటలాడిరి. కాని లాభము లేకపోయెను. అవకాశము కలుగలేదు.

తుదకు వా రాలోచించుకొని, ప్రమాదసమయమున మ్రోయించుటకు పూర్వమే నిర్ణీతమైన యొకానొక శంఖనాదము వారప్పుడు నగరివాకిట గావించిరి. అప్పుడు మూడుజాములు కావచ్చుచున్నది. రాజసింహు డది యాలకించెను. గోదావరిపండితులు తన్ను జనకుని వలె నిర్లిప్తుడని వర్ణించియుండిరే! ఇప్పుడు సంభ్రమము ప్రదర్శించుటెట్లు?

వ్యవహారదక్షు డగు నాతడు నెమ్మదిగా, అకాల మయినదను నెపమున, నా పూటకు శాస్త్రార్థములు చాలింపజేసి పూజాపరిసమాప్తి గావించెను. మరల సాయంకాలపూజ జరుగు ననియు నాసమయమున “ఊరుభంగ”మను రూపకము కేరళనటులు ప్రదర్శింతు రనియు, నా పిమ్మట నా రాత్రి జాగరణము చేయుచు శాస్త్రార్థములు సాగింపనగు ననియు, పండితుల నందర రావలసిన దనియు నాదరగౌరవములతో నాహ్వానించి వారలను విడుదులకు పంపజేసెను.

కొప్పెరుంజింగ డంత చీనాంశుకనిర్మిత మగు తన యేకాంత మందిరమున జేరి సేనాపతులు పంపిన వార్తాహరుని బిలిపించి విషయము తెలిసికొనెను. అంతలో శీఘ్రగతి మరి యిద్దరు వేగరులు వచ్చి నూతనవార్తలు నివేదించిరి.

రణరంగములనుండి వచ్చిన వార్తలు కొప్పెరుంజింగనికి ఒక్కసారిగా నావేగమే కలిగించెను. అతడు నిజముగా నా వార్తలు నమ్మలేకపోయెను.

పాటు ప్రారంభము చూచుకొని అప్పుడే చోళనావలు

(40 వ పేజీ చూడుడు)



# తెరచాటు

నా పేరు సౌదామిని. దానికి తగినట్లుగా నా జీవితక్రమం మొదటినుంచి మెరపువలె అశాశ్వతంగా గడచిపోయింది. కాని ఆ క్షణికకాలంమాత్రం, ఆయా సంఘటనగాని, సన్నివేశముగాని మెఱపుకాంతివలె గాఢముగా హృదయాన్ని దూసుకొనిపోయేది. వెంటురు అంధకారం చీకటేగా! అట్లాగే ఆ క్షణభంగురమయిన సుఖాంతన్న విషాదచ్ఛాయలు అలుముకునేవి.

సాధారణంగా మెరపు వుంటే కాలం చాల తక్కువ తరువాయి చీకటికాలం చాల ఎక్కువ. అట్లాగే నాజీవితంలో సుఖాలకన్న కష్టాలు ఎక్కువకాలం కాపురం చేశా యని చెప్పకతప్పదు. అంటే నా జీవితం దాదాపు హంసపాదులతో నిండిన వ్యాసం అయిపోయిందన్నమాట.

నా యథాస్థానమయిన కిటికీ తెరచాటున కూర్చుని, చాలా పర్యాయములు ఆలోచించుకు చూచాను — యిందులో నా దోషము ఏమైనా వున్నదా అని. నాకు అవగత మయినంతవరకు, నాదోషం — ఆ విషయంగురించి ఎక్కువగా ఆశాజనకంగా తలపోయడంవరకే. మిగిలినదంతా ప్రకృతి పురుషునకున్నూ, విధాతకు అంటగట్టక తప్పదు. సరే! ఈ తప్పొప్పుల బాధ్యతల నిర్ణయం వదలివేయండి. దానికి కర్తలు ఎవరూ కాదని వూరుకోవడం మంచిది.

మానాన్నగారు మిలిటరీనుంచి క్షేమంగా తిరిగిరావడంవలన సివిలులోకూడా మంచి వుద్యోగం లభించింది. స్థానికంగా ఉన్నతమైన స్థానం ప్రాప్తించింది. ఊరికి మధ్యగా ఒక మంచి బంగళావంటి

శ్రీ కోటంరాజు జనార్దనరావు

డాబాను కొనగలిగారు నాన్నగారు. పాశ్చాత్యానుకరణప్రకారం యిల్లంతా తెరలతోను, లైట్లతోను అలంకరించబడింది. ఇల్లు విశాలమయింది అవడంవలను, నాకు యుక్తవయస్సు వచ్చేసరికి తల్లి గతించడంవలనను, జ్యేష్ఠపుత్రికనయిన నాకు ఒక గది ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడ్డది.

అలంకరణలో పాశ్చాత్యానుకరణ వంటబట్టింది, గాని, మానాన్నగారికి హిందూ సాంప్రదాయాలను దాటి నడవడంమాత్రం చేతకాలేదు. అంటే మనస్థైర్యం లేక కాదు. ఇష్టంలేక. దానితో **S.S.L.C.** వరకు గరల్స్ స్కూలులో చదివినప్పటికీ నేను హిందూసాంప్రదాయాలప్రకారం యువతలకు వచ్చి, స్వేచ్ఛగా పురుషులతో తిరిగే అవకాశం కలుగలేదు నాతోపాటు మిగిలిన యిద్దరు చెల్లెళ్ళుకూడా అసాంప్రదాయాలనే పాటించవలసివచ్చింది. కాని వారి వయస్సు చిన్నది అవడంవలన, నా కున్న అజమాయిషీ, వారికి అవసరం లేకపోయింది.

నేను యిప్పుడు అష్టావశిని. కాలాంతరం వలన నాకు యింకా వివాహం కాలేదు. అందుకు మానాన్నగారి అశ్రద్ధ కొంతవరకు కారణం. కాని ఒకటి రెండు సంవత్సరాల నుంచి మానాన్నగారు తీవ్రంగా నావివాహ ప్రయత్నాలు సాగిస్తున్నారు. ఇంతకాలం ప్రయత్నించినా నాకు వివాహం కాకపోవడానికి కారణం, నేను అందవిహీన ననుకుంటారేమో? కాదు నాకు చెప్పుకోతగిన అందచందాలే వున్నాయి. నన్ను అందగత్తెలలో జమకట్టుకోవచ్చును. అయినా ఈ రోజులలో వివాహానికి ప్రాముఖ్యత కేవలం అందం కాదని అందరికీ విదితమే ననుకుంటా! దానికి ప్రత్యక్షఉదాహరణ నేనొకదానిని.

నాబంధువు లందరూ, నా తల్లి బ్రతికివుంటే యింకా చిన్న వయస్సులో ముందర వివాహం అయిపోయివుండేది అంటూ వుండేవారు. అది ఎంతవరకు వాస్తవమో నాకు తెలియదు. ఎందుకంటే, మా నాన్నగారికి తన కెంత తోస్తే అంతేనే గాని యితరులమాట తనకు నచ్చకపోతే వినకేవినడు. జ్యేష్ఠపుత్రిక నవడంవలననో ఏమో, కొంత నాకోరికలను తనకు యిష్టం లేకపోయినా పాటిస్తూ వుండేవారు. నన్ను యింటర్ చదివిస్తా నన్నారు. ఇప్పటికే చక్రవర్తుల, రాజుల, పుట్టినదినాలు, లెక్కలు కల్లెవేసి నా లేతబుర్ర అలిసిపోయింది. అందుకని నేను దానికి యింకా శ్రమ నివ్వడానికి అంగీకరించలేదు. అంతటితో నావిద్యార్థినిదశ అంతమయిపోయింది.

బయటప్రపంచంలో, ఈ వగుడి నాటక దినాలలో మానాన్నగారు, నావివాహానికి ప్రయత్నాలు తీవ్రంగా సాగిస్తున్నారని యింతకు పూర్వం చెప్పాను. నేను మానసిక ప్రపంచంలో ఆశోగ్కాను కొనసాగించుకునేందుకు తెలియకుండా ప్రయత్నం చేశాను.

గృహకృత్యాలను సాకుకునేందుకు తగిన హంగు వుండడంవలన నా స్నానభోజనాదికసమయాలలో తప్ప మరి యితర సమ

యాలలో, నాగది దాటి వెళ్ళవలసిన అవుసరం లేదు. అంటే దాదాపు రోజుమొత్తంలో ఒరవై రెండుగంటలదాక నాగదిలోనే కాలక్షేపం చేస్తూండేదాన్ని— మీరు ఆశ్చర్యం వేయవచ్చును—. ఈస్వకీయబంధి కాన ఏవిధంగా నాకు మధురం అయిందా అని—. ఏమో దానికి జవా బియ్యలేను. కాని నాకు ఆ పూలల్లా, తెల్లగా సున్నంతో చిరునవ్వులను వెదజల్లుతున్న గోడలు, దాని మీది పటాలు. కాకపోతే నా బంధుగులు అని చెప్పటానికి తెరచాటునుండి కిటికీఅవతల కనపడే బాటసారులు అని చెప్పడానికి కొంత సాహసిస్తున్నాను.

చక్కగా శృంగారించుకొని, కిటకీ యివతలగదిలో, ఏ నవలో పుచ్చుకొని, తెరచాటుగుండా ప్రపంచాన్ని చూడడానికి ప్రయత్నిస్తూండేదాన్ని. ఏ ప్రేక్షకుణ్ణీ ప్రపంచం యింతవరకు కాదని తిరస్కరించలేదు. ఈ మౌనప్రేక్షకురాలిని ఒయటి ప్రపంచం ఏవిధంగానూ ఆక్షేపించలేదు. పైగా ఆదరించింది. దానికి చిహ్నంగా చాలమంది, ఈవిలోకనాన్ని అర్థం చేసుకున్నవారు ఆకిటికీ, వున్న తెరచాటుగుండా కనపడే నన్ను మౌనంగా పలుకరించి, హెచ్చరించి వెడలిపోయేవారు. ఈ మౌన సంభాషణలు, నాకు చాల ఆనందాన్ని యిచ్చేవి. అవే నాకు కాలక్షేపం. ఈ విధంగా రోజులు, నెలలు గడచిపోతున్నాయి.

కాని అనుక్షణము ప్రపంచపుపోకడలను విలోకించేవారికి, ఒక తెలియని శక్తి వస్తుంది. ప్రాపంచికగమనంలో ఏచిన్న అభ్యుదయాన్నైనా తొందరగా గమనించగలరు. దానితోపాటు నాలోకూడ కొంత మార్పు వస్తోందని గ్రహించుకోగలిగాను.

'సఖ్యం సాప్తదీనం' అన్నారు పెద్దలు. అంటే ఏడు అడుగులు యిద్దరు కలసి వేస్తే స్నేహం కలుస్తుందని పెద్దల అభిప్రాయం. నాజీవితంలో దానికి ఒక తోక లభించింది మనం వారితో కలసి ఏడు అడుగులు వేయకపోయినా, మనం చూస్తుండగా వారు రెండుసారులు ఈ సాప్తపదీనాన్ని పూర్తి చేస్తే, వారు మనకు పరిచితులు అవుతారని, నాకు ఈ తెరచాటు అనభవంతో విదితమయింది.

ఇప్పుడు అరోడ్డుమీద నడచేవారిలో దాదాపు చాలమంది ముఖాలు నాకు పరిచితమయ్యాయి. అందులో నా వునికిని గ్రహించినవారు అరుదు! వారు నాకు దగ్గరివారని నేను వేరే చెప్ప నక్కరలేదనుకుంటాను.

సాధారణంగా వున్న అంతమంది స్నేహితులలో ఏఒకరో, యిద్దరో ఆత్మీయులవుతారు. అట్లాగే ఈలాచూచేవారిలో ఒక యువకుడు నాకు తెలియకుండా ఆత్మీయుడయినాడు. ఒకనాడు, నేను అప్పుడే శృంగారించుకొని, బయటి ప్రపంచాన్ని చూచేందుకు, అనకూలంగా వుండేందుకు తెరను తీసి సర్దుతుండగా, ఈ యువకుడు తారసిల్లాడు. తెరసద్దడంలో నా గాజులు ధ్వనిచేయడం విన్నాడు. గాజులధ్వని ఏ యువకుని ఆకర్షించదు? వెంటనే అతడు నిలబడి కిటికీవంక చూచాడు. అట్లాధైర్యముగా నిలబడి చూచే అతనిని నేను చూడక తప్పలేదు. అట్లా తెలియకుండా ఒక నిముషం గడచివుంటుంది. అప్పుడు నాలో అవ్యక్తమధురమయిన సిగ్గు ప్రవేశించింది. వెంటనే తెరను నామీదకు లాక్కున్నాను. ఒక నిముషంతరువాత తెరచాటుగుండా తొంగిచూచాను. అతను అప్పుడే నిస్పృహతో కదలివెడుతున్నాడు.

ఆ విధంగా అతనితో నాకు పరిచయభాగ్యం లభించింది. అప్పటినుంచి అదే వేళకు తయారయి, ఆ తెరదగ్గర కూర్చుని చాటుగుండా అతనిరాకకు ఎగురుచూస్తూ వుండేదాన్ని. రోజు కొక పర్యాయమైనా అదేసమయానికి నాలుగుకళ్లూ కలుసుకొని, పలుకరించుకునేవి. ఆ పలుకరింత భావమేమో అది కోరే స్వార్థమేమిటో పోనుపోనుగాని అర్థం కాలేదు.

సూర్యోదయ సూర్యాస్తమయాలే ప్రతి రోజూ ఒకే సమయానికి జరుగవు. అటువంటప్పుడు ప్రకృతి యథేచ్ఛకు పాత్రులమయిన మానవులుమాత్రం ఆ నియమాన్ని ఎట్లా పాటించగలరు. ఆవిధంగానే మా కలయిక, మౌనసంభాషణలు జరిగే కాలనిర్ణయంకూడ మారుతూవుండేది. దాంతో నాకు ఒకచిక్కు వచ్చింది. ప్రతిదినము ఆ పలుకరింతకు నేను అలవాటుపడ్డాను. ఆ కలయిక లేనిదే తోచదు. అందుకని ఆరోజుల్లో ప్రతిదినము నేను అతనికోసం ఎదురుచూస్తూ కూర్చోవలసివచ్చేది; కూర్చునేదాన్ని.

కాని అతను నా ఈ సమస్యను గుర్తించాడో ఏమో తెలియదుగాని, మిగతాసమయాలలో అతనికొరకు నిరీక్షించకుండా, తాను వచ్చేసమయం తెలియకుండానే కొన్ని సూచనలు అందచేసేవాడు. అతని బూటు ధ్వని నాకు కంఠస్థమే. బిగ్గరగా నవ్వుతూ, స్వేచ్ఛగా మాట్లాడే అతని కంఠధ్వని నాకు పరిచితమే. దూరంగా వుండగానే, మహారాజు తరలివచ్చేటప్పటి బహుపరాకులులాగ, ఆబూటుటకటకధ్వని, అతని కంఠధ్వని. అతని రాకను తెలియపరచేవి. తొందరగా నా శృంగారాన్ని సరిదిద్దుకొని జారగంటితో తొంగి చూచేదాన్ని. అతను చూచి వెళ్లిపోయేవాడు.

ఆ క్షణకాలంకొరకు నేను ఎగురుచూస్తూ కూర్చోవలసివచ్చేది. ఒక్కొక్కనాడు రోజంతా నిరీక్షించవలసివచ్చేది. సూర్యాస్తమయం అయింతరువాత యిబ్బంది లేకుండా, మునిసిపాలిటీవారి ఎలక్ట్రిక్ స్తంభము మా కిటికీకి ఎదురుగా వున్నది. కాబట్టి ఏఅవస్థా లేకుండా ఈ కలయిక జరుగుతూ వుండడానికి అవకాశం లభించింది. పోను పోను యిదే నాకు చదువూ, కాలక్షేపమూ అయిపోయింది. ఈ అవ్యక్తమూకసంభాషణలే నాకు పరిపూర్ణపరిజ్ఞానాన్నీ, తెలియని నూతనఅనుభూతులనూ అందిస్తూండేవి. మౌనంగా వాటిని స్వీకరిస్తూండేదాన్ని.

కాలం గడుచుకువస్తోంది. ఆ అపరిచిత వ్యక్తి నాకు మౌనంగా పరిచయం అయిపోయాడు. నాకు వ్యక్తిగతంగా యింకా పరిచయం కాలేదు. చేసుకోవాలనిపించింది. కాని అది అసంభవమని, దానికి అడ్డుగా సంఘం నిలబడుతుందని తెలియచేస్తూ, కిటికీవూచలు మాయిద్దరికే మధ్యగా నిలబడ్డాయి. హృదయభావాలను తెర తొలగించినట్లుగా బయటకు వ్యక్తపరచుకో వచ్చును గాని, అబలను, ఆ యినుపవూచలను ఎట్లా ఛేదించగలను? నాలో నిస్పృహ బయలుదేరింది.

కాని ఒకనాడు 'అనుకోని సంఘటన జరిగింది. కాలం అనుకూలిస్తే అన్నీ మనకు అనుపానంలో నడుస్తాయి కదా అనుకున్నాను. బయట బ్యాండు - ధ్వనితో ఏదో ***Advertisment*** బండి వెడుతోంది. నేను లోపల సోఫాలో కూర్చుని నవల చదువుకుంటున్నాను. నెమ్మదిగా లేచి వెళ్ళేసరికి బండి కిటికీ దాటిపోయింది. చాల దినాలయింది, సినిమా చూచి. కనీసం సినిమా మారిందని తెలుస్తే నాన్నగారిని బలవంతం చేసి వెళ్ళవచ్చు ననుకున్నా. సినిమా–అంటే జ్ఞాపకానికి వచ్చింది – ఈతనిని సినిమాలలో బిగ్గరగా మాట్లాడుతూ, స్వేచ్ఛగా నవ్వుతూండగా, ఒకటిరెండుసార్లు చూచినట్లు

క్షాకం. మౌనంగా అట్లాగే కిటికీదగ్గర, అనంతశూన్యంలోకి చూస్తూ నిలబడి పోయాను.

"అక్కయ్యా, ఈవాళ నాటకంటే వెడదాము" అంటూ నాచెల్లెలు ఒక *Pamphlet* తెచ్చింది.

చూచాను. అది నాటకపు *Advertisement*. ఆ పేపరును నన్ను ఆకర్షించింది. లోపల ఈతనిబొమ్మకూడా వేసివుంది. క్రింద అతని పేరు ప్రస్ఫుటంగా ముద్రింపబడివుంది. పేరు జగన్నాథ్ అయితే ఈతను ఒక నటకుడన్నమాట. గరల్సుస్కూలులో చదువుతూంటెగా, నాటకాలలో కొన్ని బహుమతులు పొందివుండడంవలన, నాకు నాటకాలంటే అభిమానం. నటకులంటే గౌరవం. అందులో పరిణితులు నాటకం వేస్తున్నారంటే మన అభిమానం వర్ణించలేము. తప్పక వెళ్ళాలనిపించింది. క్షణికంగా చూచి తృప్తిపడే అతనిని ప్రత్యక్షంగా, వివిధ హావభావవిలాసాలలో చూడవచ్చును. చెల్లెల్ని వొప్పించి, నాటకానికి వెళ్లేందుకు దానిచేత బలవంతపెట్టించాను. నాన్నగారికి వొప్పుకోక తప్పలేదు. ఆనాడు నాటకానికి వెళ్ళాము. అందరిలోను ఈతని వేషమే నాకు బాగా నచ్చింది. మరునాడు పత్రికలలోకూడ ఈతనిబొమ్మ ప్రచురితమయ్యి ఈతని నటనాకౌశల్యాన్ని శ్లాఘించారు. దాంతో ఈతనిమీద నాగౌరవం ద్విగుణీకృతం అయింది.

నాటకం అయింతరువాత ఈతనిని మరల చూడాలన్న కోరిక కలిగింది. వీలుగావుంటే అభినందనలు అందచేద్దామనిపించింది. అవకాశంకోసం ఎదురుచూస్తున్నాను. ఒకనాడు దీపాలు పెట్టినతరువాత ఈతను యిద్దరు బాగా అలంకరించుకున్న మహిళలతో, కేరింతాలాడుతూ, నవ్వుకుంటూ రోడ్డుమీదుగా వెడుతున్నాడు. అలవాటుప్రకారం కిటికీవంక చూచి వెళ్లిపోయాడు.

నాలో ఈర్ష్య ప్రారంభమయింది, అన్యాక్రాంతుడయిపోతున్నాడని. వారం రోజులు ఆవేశంతో, కోపంతో అతనిని మరచిపోదామని తెర మూసివేసి తిరిగాను. అతను వచ్చే ముందు మామూలుగా వినపడే బహుపరాకులను ఆలకించినప్పటికీ తెర తీయలేదు. కాని నెమ్మదిగా ఆవేశం చల్లబడింది. దానికి కారణం నాగదిలో రాసక్రీడలలో వున్న కృష్ణుని చిత్రం వుంది. అది నాకు సమాధానం యిచ్చింది. అయితే జగన్నాథ్ కూడ శృంగారపురుషుడన్నమాట. స్త్రీకి కావలసింది శృంగారపురుషుడేగా. మరల తెరను తెరిచాను.

* * *

మానాన్నగారు నాకు కాలక్షేపన కావడం లేదని ఆ మధ్య కొన్ని పత్రికలకు మ్యాగజైనులకు చందాలు కట్టారు. యధావిధిగా అవి వస్తున్నాయి. మానాన్నగారి లాభమే కాని, కన్యకు కాలక్షేపన కాకపోవడమేమిటి? చపలచిత్తులకు కాలక్షేపన కాకపోవడం అంటూ వుండదు. వారికి అసలు వూపిరే ఆడదు. రోజుకు ఇరవై నాలుగుగంటలు చాలవు. అందుకనే నాకు ఈ పత్రికలను చూచే అవకాశం వుండేది కాదు.

ఈ తెరమూసిన వారంరోజులలో నిమ్మదినిమ్మదిగా పత్రికలు తిరుగవేయడం ప్రారంభించాను. ఆనాడు ఆదివారం. ఆంధ్రపత్రిక తీశాను. కథాసాహిత్యం వైపుకు నా దృక్కులను సారించాను. మళ్లీ ఈతను ప్రత్యక్షమయాడు. పేజీనింపుతూ జగన్నాథ్ కథ వ్రాశాడు. "నేను" అంటూ అంటే తనజీవితంలోని అనుభూతిని వ్రాసుకున్నాడన్నమాట.

ఇంతకుపూర్వం అతనిపై ప్రబలియున్న ద్వేషంతో ఆ పత్రిక అవతల పారవేసి, కాలుగాలిన పిల్లిలాగ తిరిగాను యింట్లో. నాకు అశాంతిగా వున్నప్పుడు నాన్నగారి దగ్గరకు వెళ్లికూర్చోవడం అలవాటు. మానాన్నగారు పడకకుర్చీలో కూర్చుని, ఏదో ఆలోచించుకుంటున్నారు. నేను రావడంతోనే "రా అమ్మా కూర్చో" అన్నారు. కుర్చీ దగ్గరకు లాక్కొని కూర్చున్నాను. వారికి తెలుసును నా మనస్సు బాగుండకపోతేనే గాని అక్కడకు రానని.

"అమ్మా, విశేషాలు ఏమిటి?" అన్నారు.

ఊరకే కుప్పనవ్వు నవ్వి "ఏంలేవు నాన్నా" అన్నాను. ఒకసారి వారు నావంక చూచి, ఒక్కక్షణం ఆగారు.

"పేపరుచూచావా, అమ్మా" అన్నారు. "లే" దన్నాను.

చెల్లాయిని పిలిచి పేపరు తెప్పించి, తిరగవేసి ఒక కాగితం యిస్తూ—

"చూడమ్మా. ఈకథ చదువు. వింటాం. కాలక్షేపన అయిపోతుంది" అన్నారు.

చదవక తప్పలేదు. మానాన్నగారిమాటను కాదనలేనాయె మరి! కాలంలోని మార్పులను సూచిస్తూ, తన అనుభవంలోని సంఘటనలను, వంశక్రమానుగతంగా చిత్రించాడు. చాల బాగుంది. మానాన్నగారు బాగుందని మెచ్చుకున్నారుకూడాను. దాంతో అతనిపైని కోపం, మేఘంలాగ చెప్పపెట్టకుండా విడిపోయింది. అంటే జగన్నాథ్ రచయిత కూడా నన్నమాట.

అకస్మాత్తుగా నాకు, రచయిత, నటకుడు అయిన వ్యక్తిని వివాహంచేసుకుంటే బాగుంటుందనిపించింది. నాఅభిలాషకు సమాధానంగా, అందుబాటులో నిలబడ్డ వ్యక్తిని తలుచుకుని, సిగ్గుపడి, నాగదిలోకి వెళ్లి సోఫాలో కూలబడ్డాను. నాలో ప్రేమాంకురం తెలియకుండా ప్రారంభించిందని, ఆనాడు తెలుసుకోలేకపోయాను.

\+ + ×

నాలో ఈమానసికపరివర్తన జరుగుతున్న సమయంలో, మానాన్నగారు నాకు వివాహప్రయత్నాలు ప్రారంభించారు. ఆప్రయత్నాలు ఒకదరి చేరేవరకు, నాదగ్గరకు ఆ విషయం రాలేదు. తెలిసినతరువాత తప్పుకునే అవకాశం గాని, ఆశగాని లభించలేదు. ఈ సమయంలో నాతల్లి లేకుండా చేసిన విధాతను నాలో నేను దూషించుకున్నాను. ఎందుకంటె, తండ్రి,- సంతానం మధ్యతల్లి '*Broad Casting Station*' లాంటిది. ఒకరి మనస్సులోని భావాలు యితరులకు ఆపెద్వారా అందచేయబడుతాయి. ఈసమయంలో మాఅమ్మగారు జీవించివున్నట్లయితే మానాన్నగారి ఈపెళ్లిప్రయత్నాలు నాకు ఆదిలోనే తెలిసేవి. నాఅభిలాషనుకూడ, కనీసం చూచాయగానైనా, అందచేసేదాన్ని. ఇప్పుడు లేనిదానికి విచారించి ఏంలాభం అని నిట్టూర్చి వూరకున్నాను.

అనుకోకుండా జగన్నాథ్ వ్రాసిన కథలోని వాక్యాలు జ్ఞప్తికివచ్చాయి.— "నిస్పృహచెంది ఆగిపోవడం భారతజాతిసాంప్రదాయం కాదని". అవునని పించింది. చారిత్రాత్మక సంఘటనలు జ్ఞప్తికి వచ్చాయి. వెంటనే భవిష్యత్తునుగురించి తలపోయడం మంచిదనిపించింది బాగా ఆలోచించిచూచాను. దానికి ఒక్కటే మార్గం కనపడింది. రుక్మిణీసతి, కృష్ణునితో కలసి వెళ్లిపోయినట్లు, చల్లగా ఈయువకునితో వెళ్లిపోదామన్నంతవరకు వచ్చింది వూహ. కాని ధైర్యం చాలలేదు. కనీసం ఈఅభిలాషను అతనికి అందించలేకపోయాను. దానికి నిజా

(33-వ పేజీ చూడుడు)

# రామమోహనుని ఏకేశ్వరారాధన

శ్రీమతి డా. వారణాశి యశోదాదేవి

భారతదేశములో 18వ శతాబ్దములో బ్రిటిషు సామ్రాజ్యస్థాపన ఫలితముగా ప్రజాజీవనములో కదలిక గలిగెను. రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, మతవిషయములలో అనేకమార్పులు- కొన్ని విప్లవరీత్యా, కొన్ని సంస్కరణ రూపమున మరి కొన్ని క్రమపరిణామమున సంభవించెను. ఈ వైవిధ్య జాతీయోద్యమములో ముందంజ వైచినది వంగభూమి. బెంగాలులో నుద్భవించిన మహనీయులలో రాజా రామమోహనరాయి గొప్ప మతసంస్కర్తగా చిరకీర్తి నందెను. అక్బరు పాదుషావలె వివిధ మతముల గాలించి కొత్త మతము- ఏకేశ్వరా రాధనము ముఖ్యముగ గల బ్రహ్మమతము సంధానించినాడు రామమోహనుడు.

సంఘసంస్కర్తలలో ప్రప్రథముడైన రామమోహనుడు 1772 సం|| మే 22 న సంపన్న కులీన బ్రాహ్మణకుటుంబములో జన్మించెను. ఇతని వంశీకులు చైతన్యస్వామి యారాధకులు. తల్లివంశమువారు శక్తిపూజా ధురంధరులు. తలిదండ్రులు రామమోహనునకు బాల్యమునందే వివాహము చేసిరి. భార్య మృతిజెందగా మరల నిర్వురుబాలికల నతనికి బెండ్లిచేసిరి.

రామమోహనుడు పండ్రెండవయేట విద్యాభ్యాసమునకై పాట్నాకరిగెను. ఇచట యితనికి సూఫీముస్లిము వేదాంతుల రచనలపై మక్కువ గలిగెను. సూఫీసిద్ధాంతములు చాలవరకు హైందవ వేదాంతసూత్రములతో నేకీభవించును. రామమోహనుడు యావజ్జీవము సూఫీరచనలు ప్రేమించెను. ఇతని మాటలందును, చేష్టలందును ముస్లిముసాంప్రదాయము గోచరించుచుండెను బి.సి. పాల్ అన్నట్లు రామమోహనుడు యిస్లాముసందలి సామాన్యులకు సౌలభ్యమగు భావములను చక్కగ గ్రహించియుండెను. 15వ యేట పాట్నానుండి యింటికి వచ్చి విగ్రహారాధన విషయమున తండ్రితో తీవ్రముగా వాదించి యిల్లువిడచి దేశాటన మరిగెను. ఈసందర్భమున బౌద్ధమతమును జదివి, లామాలతో తర్కించుటకై రామమోహనుడు టిబెటునకేగె నందరు. తండ్రి పుత్రుని యింటికి పిలిపించెను. అటుతరువాత రామమోహనుడు కాశికేగి సంస్కృతము, పారశీకము, వేదాంతము చదివెను. 1796లో ఆంగ్లము నభ్యశించెను. 1804 లో పారసీయందలి *Tuffatul Mwwshhlddin* అను గ్రంథమును వెలువర్చెను. ఇందు రామమోహనుడు యిస్లాము మున్షీలయొద్ద నేర్చికొనిన *deism* వెల్లడియగుచున్నది.

తూర్పుయిండియాసంఘమున వుద్యోగము చేయుకాలమంగును రామమోహనుడు మత పరిశోధనలు చర్చలుసాగించుచు నేయుండెను. ఆంగ్లసారస్వతము జనువుటయందు యితనికి *John Digby* చాల సాయపడెను. రంగపూరులో హైందవులు, జైనులతో మత తర్కములు రామమోహనుడు చేయుచుండెను. ఇతని విపరీతాభిప్రాయములను తల్లి గర్హించుచుండెను. చాలకాలము భార్యలితనితో నుండ నిరాకరించిరి. 1814లో వుద్యోగమును విరమించి కలకత్తాలో స్థిరవాస మేర్పరుచుకొనెను.

ఆంగ్లవిద్య రామమోహనుని భావములు నమ్మకములలో గొప్ప మార్పులు తెచ్చెను. కలకత్తాలో నితడు తన మతవిశ్వాసములు ప్రచారము చేయసాగెను. 1815లో ఆత్మీయసభ అను సంఘమును స్థాపించెను. వారమునకొక పరి సమావేశము జరుగుచుండెను. వీనిలో స్మృతులు పఠించుచుండిరి. గేయములు పాడుచుండిరి ఈ సభ 1819లో నిలిచిపోయెను. 1816, 1819 మధ్య రామమోహనుడు వుపనిషత్తులు, బాదరాయణుని వేదాంతసూత్రములు జదివి బెంగాలీలో సంక్షిప్తముగ యనువదించి హిందూమతమును సమర్థించుచు రెండు చిన్న గ్రంథములు వెలువరించెను. రామమోహనుడు వుపనిషత్తులలో (*theism*) గలదు కాని విగ్రహారాధన గాన రాదనియు, కావున జనులు ప్రాచీనహైందవ మతమును అనుసరింపవలె ననియు బోధించెను. ఇతని శోధలు రచనలు బెంగాలునందే కాక భారతదేశమందంతటను కలకలము గల్గించెను.

రామమోహనుడు సెరంపూరుమిషనరీలతో స్నేహము చేసి గ్రీకు, హీబ్రుభాషల నేర్చికొని క్రైస్తవమతసిద్ధాంతముల శ్రద్ధతో బరిశీలించి క్రైస్తవనియమములు తనకు తెలిసిన యితరమతనియమములకంటె సామాన్యమానవు లనుసరించుటకు సాధ్యముగ నున్నవని కనిపెట్టెను. 1820లో యితడు జీససుసిద్ధాంతములను రచించెను. ఈ గ్రంథయవతారికలో ఈ సులభమైన మతనైతికనియమములు మానవుల యభిప్రాయములను ఏకేసునిపై పు కేంద్రీకరించుటకు చక్కగా సరిపోయియున్నవి. మానవ జాతిప్రవర్తనను, దేవునికి తమకు సంఘమునకు గల బాధ్యతలను చక్కగా నిర్ణయించుచున్నవి. కావున దాని విస్తరింపజేయుటవలన గొప్పఫలితములు గల్గునని నమ్ముచున్నాను" అని వ్రాసెను. క్రైస్టు (*theist*) అనియు నతనిఅనుచరులు అతని భావములు సరిగ అర్థము చేసికొనక క్రైస్తవమతమున పొరపాటులు చేసిరనియు రామమోహనుని యభిప్రాయము. హైందవభావయభివృద్ధిలో యీ గ్రంథము గొప్ప ముందంజను చూపుచున్నది. కాని సెరంపూరు మిషనరీలు రామమోహనుడు హిందూదేశములో క్రైస్తవమతవ్యాప్తి నరికట్టుటకై క్రైస్తవమత సిద్ధాంతముల దురుపయోగము చేసెనని యభిప్రాయపడిరి.

రామమోహనుడు (*Rev. Adam*) అను మిషనరీతో కలిసి 1821లో ఒక యూని



టేరియను మిషను స్థాపించెను. దీని నిర్వాహకవర్గములో యూరోపియనులు హిందువులు నుండిరి (services) ఆంగ్లమున నడుపబడుచుండెను. దీని కనుబంధములుగ ఒక ముద్రణాలయము, వేదాంతికళాశాల నడుపబడుచుండెను. కొన్నాళ్లకు సంఘము స్తంభించెను. కొందరు మిత్రుల సలహాపై రామమోహనుడు (service) దేశభాషలో జరుప నిశ్చయించి చిత్పూరురోడ్డులో ఫెరింగ్ కమల్ బోసుయింటి పైభాగ మద్దెకు తీసికొనెను. 1828 ఆగస్టు 20 తేదిన యిచట ప్రథమసమావేశము జరిగెను. మొదట బ్రహ్మసభ యని పేరిడిరి. తర్వాత బ్రహ్మసమాజమని మార్చిరి. బ్రహ్మశబ్దము వేదాంతోపనిషత్తులందలి దేవునకు బ్రహ్మనుండి యుత్పత్తియైన విశేషణము. రామమోహనుని సహాయులలో ద్వారకనాథఠాకూరు మరికొందరు పండితులు కలరు. ఈసంఘసమావేశములు ప్రతిశనివారము సాయంత్రము 7 గంటలనుండి 9 వరకు జరుగుచుండెను. (service) నాల్గుభాగములుగ నుండెను. 1. సంస్కృతములో నుపనిషత్తులనుండి కొన్నిశ్లోకముల పఠనము. ఇది బ్రాహ్మణులకు మాత్రము ప్రవేశము గల ఒక గదిలో జరుగుచుండెను. 2. ఆ భాగముల బెంగాలీలోని కనువదించుట 3. బెంగాలీలో బోధ. 4. రామమోహనుడు, అతని మిత్రులు బెంగాలీ సంస్కృతములందు రచించిన గీతముల పాడుట. ఈ సభకు సభ్యత్వము, మతము లేవు. వారసమావేశములందు ఎవరైనను పాల్గొనవచ్చును.

తర్వాత కొద్దికాలమునకు చిత్పూరురోడ్డులో సమాజమునకై క్రొత్తభవనము కట్టబడెను. 1630 జనవరి 23వ తేదిన ప్రారంభోత్సవము జరుపబడెను. దీని *trust deed* యీక్రిందివిధముగా నున్నది. "సర్వజనులచే నిది బహిరంగసమావేశస్థలముగ వాడబడవలెను. ఏవిధమైన భేదములు చూపబడవకూడదు అందరు సరియైన శ్రద్ధాభక్తులతో భగవానుని యారాధించవలెను. ఆ దేవుడు విశ్వనిర్మాత, నిర్వాహకుడు. వాని కేవిధమైన పేరు, బిరుదు ఏజీవికి సంబంధించినది చెప్పరాదు. ఏవిధమైన ప్రతిమ, విగ్రహము, శిల్పము, చెక్కడపుబొమ్మ లిఖితచిత్రము, యీ భవనములో నుంపబడరాదు. ఏవిధమైన యజ్ఞము యిందు చేయబడరాదు. ఇందులో ఏజంతువుగాని జీవిగాని వధింపబడరాదు. ప్రార్థన చేయుటలో యితరులు పూజించు జడము లేక జీవముతో నున్న యే యాదర్శమును నిందింపరాదు. సృష్టికర్త,నిర్వాహకునిగురించి ధర్మము, నీతి, దయ, సౌశీల్యము, వృద్ధినొందించు అన్నిమతములవారికి ఐకమత్యమును గూర్చునట్టి బోధలనే బోధించి అట్టి పుద్బోధకములగు పాటలనే పాడవలెను."

ఐరోపియను జీవితమును మతమును స్వయముగ జూడగోరి రామమోహనుడు 1830 నవంబరులో యింగ్లాండు వెళ్లెను. తనకులమును రక్షించుటకై యిర్వురు నౌకర్లను వెంట తీసికొనివెళ్లెను. ఇంగ్లాండులో యితని చాల గౌరవించిరి. గొప్ప మేధావి, దయామయుడు, ధైర్యశాలి, స్థితప్రజ్ఞుడైన రామమోహనుడు, బ్రిటిషుసంబంధము క్రైస్తవమతమువల్ల భారతదేశము లాభముపొందగలదని గుర్తించినవారిలో ప్రథముడు. పాశ్చాత్యములగు వాని నట్టే యనుకరించక వానిని స్వదేశీయములు జేసికొనవలెనని అతని యభిప్రాయము. రామమోహనుడు సాధారణహిందూజీవితమందలి మూఢనమ్మకములు, అవి నీతిపనులు చూచుచు, మరొకప్రక్క యిస్లాము క్రైస్తవము ఉపనిషత్తులలోని సత్యముల గ్రహించుచు సామాన్యులకు సులభగ్రాహ్యమగునట్లు ఒక మార్గమును కనిపెట్టెను. మూడు మతములకు సమానమైన ఆస్తికతను గ్రహించి అదియే హిందూమతమునకు ముఖ్యభాగమని, అది ప్రపంచమతముగ సర్వమానవులు ఏకీభవించవచ్చునని రామమోహనుని తాత్పర్యము.

రామమోహనుడు తాను హిందూమతమును పరిశుద్ధిచేయుచున్నటు నమ్మినను నిజమునకు *deism* సిద్ధాంతమును, ఆరాధనను ప్రతిపాదించెను. 18 ||శ|| యూరపులో *deism* సాధారణమే. ఉపనిషత్తులు బ్రహ్మకు నిజముగ పనిలేదనియు, అతని క్రియలు లీలలు మాత్రమే ననియు, మాటలకు, భావములకు అతీతుడనియు, మానవుని ప్రార్థన, ఉపాసనల కందగానివాడనియు చెప్పుచున్నవి. రామమోహనుని *deism* అతని రచనలలోని పూజానిర్వచనములవల్ల తెలియుచున్నది. ఇతని గ్రంథము-మతసిద్ధాంతములో యీక్రిందివిధముగ గలదు. ప్రశ్న-ఆరాధన అననేమి? జవాబు-ఆరాధనలో ఒకరినొకరు తృప్తిపర్చుకొనుట కలదు: దేవుని సంబంధించినపుడు అతని గుణములను తలంచుట అగును. ప్రశ్న-ఆరాధన ఏవిధముగ జేయవలెను? జవాబు-విశ్వనిర్మాత, వ్యవహర్త ఆ దేవుడే యని మనమునం దుంచుకొని ఆ భావములను ఉత్తమ గ్రంథములందలి రచనలతోను, న్యాయముతోను పోల్చుకొనవలెను. ఆరాధనలో నిగ్రహమును ప్రయత్నించి దేవునిపై బుద్ధి నిల్పు విషయములు జరుపుట యవసరము. అగ్ని, వాయువు, సూర్యుడు, భూమిజములగు ధాన్యములు, మూలికలు, ఫలములు, కాయగూరలు, వీని యన్నిటినుండి నిరంతరము అనుభవించు లాభములు అతనిపై నాధారపడియున్నవి. అట్టి అభిప్రాయములు తెలియజేయుమాటలు, ఆలోచించి తర్కించుటవలన వాని యర్థము, మనస్సులో శాశ్వతముగ నిల్చును.

రామమోహనుడు పునర్జన్మను నమ్మలేదు. హిందూమతమున పునర్జన్మ, కర్మ, సిద్ధాంతములు చాల ముఖ్యమైనవి. ఉపనిషత్తులందలి వేదాంతములో పునర్జన్మనుండి విముక్తిపొందుటయే ముఖ్యవిషయము. ఈవిషయమున రామమోహనుడు హిందూమతమునుండి భేదించెను. ఇకమీద యితడు హిందువుగాడని పూర్వాచారసాంప్రదాయ లితనిని యనుమానముతో జూడజొచ్చిరి. రామమోహనుని మతసిద్ధాంతములు బ్రహ్మమతస్థులను యితర హిందువులనుండి వేరుజేసెను.

రామమోహనుడు నియమించిన *Service* క్రైస్తవము. ఇతని బోధలు క్రయిస్తవమత బోధలనుండి గ్రహింపబడినవే. రామమోహనుడు ఒక ప్రక్కన మతసాంఘికపరిశుద్ధతకై పోరాడుచు, మరొకప్రక్క విద్యాభివృద్ధి పత్రికాస్వాతంత్ర్యమునకై కృషిసల్పుచు పేరుగన్న గ్రంథకర్తయై హైందవయ ధర్మములకు భక్తిశ్రద్ధలతో తలయొగ్గుచు, ప్రాచ్యులకు పాశ్చాత్యులకు దూతగ నుండెను. రామమోహనుడు వర్ణవ్యవస్థను అంటలేదు. బహుభార్యాత్వమును సహగమనమును ఖండించెను. రామమోహనుని వైవిధ్యసంస్కృతికి కేశబ్ చంద్రసేన్, ఈశ్వరచంద్రవిద్యాసాగర్, శివనాథశాస్త్రి, సీతానాథతత్వభూషణ్ లు వివిధరీతుల వృద్ధినొందించిరి.

---


## నారసింహలేహ్యము

బంగారు చేర్చబడినది. మేహము, నిశ్శక్తి నిస్సత్తువ శుక్లనష్టమును హరించి బలమును కాంతిని వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

రు|| డబ్బి రు 3-4-0 పోస్టేజి 10 అ

సి. సి. ఏ. & కంపెని.

పెరిదేపి-నెల్లూరు జిల్లా.

విజ్ఞానవిశేషాలు:

# అణువులకు క్రమశిక్షణ నేర్పే ఉష్ణశూన్యపరిస్థితి



మామూలుగా మనకు పరిచయంలో ఉన్న వాయుపదార్థాలుకూడా, ఘనపదార్థాలు ద్రవపదార్థాలులాగే వేడిచేస్తే, పరిమాణంలో పెరుగుతాయి. అయితే ఘనపదార్థాలు, ద్రవపదార్థాలు, వీట్లల్లో, ఈ వ్యాకోచము, ఏపదార్థానికాపదార్థానికి ఒక ప్రత్యేకమైన విలువగలిగి ఉంటుంది. కాని వాయురూపంలో పదార్థాలు వచ్చేటప్పటికి, ఈ వ్యాకోచం అన్ని వాయుపదార్థాలకీ ఒకే విలువకలదిగా వుంటుంది.

ఏ వాయువునైనా, బైటివాతావరణానికి సమమైన పీడనస్థితిలో ఒక సెంటిగ్రేడు డిగ్రీమాత్రంగా వేడిచేసినపుడు, 0°ల వద్ద, సామాన్యవాతావరణపీడనంతో సమానమైన పీడనం గలిగిఉన్నప్పటి ఘనపరిమాణంలో 1/273 మాత్రంగా ఈ వాయువు పరిమాణం పెరుగుతుంది. అల్లాగే 1° c చల్లబడేసినప్పుడు మూల పరిమాణంలో 1/273 మాత్రంగా ఈ ఘనపరిమాణం తగ్గుతుంది. అంటే మంచు గడ్డకట్టే టెంపరేచరుకు 273° డిగ్రీలవరకు చల్లబడేస్తే, పరిమాణం మూల మొత్తంగా తగ్గిపోయి శూన్యమయిపోవాలన్నమాట. అంటే,-273°c, కంటే తక్కువ టెంపరేచరు ఉండటానికి వీలు లేదని ఊహించారు. ఈ టెంపరేచరును అబ్సొల్యూట్ జీరో అన్నారు.

సశాస్త్రీయంగా ఈ అబ్సొల్యూట్ జీరో, సెంటిగ్రేడు లెఖ్ఖను, —273.160 డిగ్రీల సెంటిగ్రేడుగాను, ఫారన్‌హీట్ టెంపరేచరులో జీరోకుదిగువను 459.688 డిగ్రీలలోనూ ఉంటుంది.

ఈ టెంపరేచరు అందుకోటానికి కృషి చేసినవారిలో విలియం ఫ్రాన్సిస్ గైయాకో అన్న కాలిఫోర్నియా శాస్త్రజ్ఞునికి నోబెల్ బహుమానంకూడా వచ్చింది.

అబ్సొల్యూట్ జీరోకు 30° సమీపంలోకి వచ్చేటప్పటికి సృష్టిలో మనకు పరిచయమున్న వాయుపదార్థాలన్నీ, (ఒక్క హీలియం వాయువుతప్ప) ద్రవపదార్థాలుగానూ, ఘనపదార్థాలుగానూ మారిపోయాయి. థర్మామీటరుగొట్టంలో వాడే పాదరసం కూడా గడ్డకట్టుకుపోతుంది. అందుచేత తక్కువ టెంపరేచర్లలో పాదరసం థర్మామీటరుతో టెంపరేచరు కొలవటం కుదరదు. ఈ పరిసరాలలో విద్యుద్యంత్రాల సహాయంతోనే టెంపరేచరు కొలవవలసి వస్తుంది.

హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులను ద్రవీభూతం చేయగలిగేటప్పటికి, యుద్ధపరికరాల తయారులో చాలా నూత్న సౌకర్యాలకూ, నూత్న పరిశోధనలకూ అస్కారం కలిగింది. యుద్ధంలో ఆక్సిజన్ వాయువు అధికంగానింపిన సిలిండర్లు అవసరంగా వాడతారు. ద్రవరూపంలో ఆక్సిజన్ తయారు చేయటంతో, ఎంతో సులువుగా అత్యధికంగా ప్రాణవాయువును, యుద్ధావసరాలకు సేకరించుకొని తీసికొనిపో వీలుకల్గింది. హైడ్రోజను ద్రవరూపంలో వాడటంవల్ల జెట్ బాంబరు విమానాలు వాట్ల వేగాన్ని మరింత వేగంచేయవచ్చునని పరిశోధనలు తెలిపాయి.

ఈ శీతలపరిస్థితిలో ప్రయోగాలు సాగించటంలో, మామూలు హైడ్రోజను, ఆక్సిజనూ కాక మరొకరకపు బరువైన హైడ్రోజిన్, బరువైన ఆక్సిజనూకూడ తయారుచేయగలిగారు. ఈ పదార్థాల పరిశోధనలు అణురహస్యాలను మరింత సూక్ష్మంగా తెలిసికోగలిగేందుకు, అటంబాంబు హైడ్రోజన్ బాంబుల నిర్మాణపరిశోధనలు మరింత ముందుకు సాగించగల్గేందుకు తోడ్పడ్డాయి.

పదార్థాలకు అయస్కాంతశక్తి కల్పించి మామూలు శాస్త్రీయవిధానాలలో ఎంత శీతల పరిస్థితికి పోగలమో అంత తక్కువ టెంపరేచరువరకు పోనిచ్చాక పదార్థానికున్న అయస్కాంతశక్తిని తీసివేయగలిగితే, పదార్థం మరికొంత చల్లబడుతుందని తెలుసుకొని గైయాకో ఆవిధానంలో అబ్సొల్యూట్ జీరో టెంపరేచరు అందుకొనేందుకు ప్రయోగాలు సాగించాడు. గైయాకో-459 5'4° ఫారన్‌హీట్ టెంపరేచరువరకు చల్లదనం అందుకోగలిగాడు. గైయాకో విధానం అవలంబించి, డచ్చిశాస్త్రవేత్తలు 459.681డిగ్రీలదాకా వెళ్ళగలిగారు. అంటే అబ్సొల్యూట్ జీరోకు డిగ్రీలో శతాంశము వారదాకా అందుకోగలిగారు.

20 వ శతాబ్ద ఆరంభ కాలంలోనే-430° డిగ్రీలదాకా శీతలపరిస్థితులను శాస్త్రవేత్తలు కల్పించగలిగారు. ఒక్క హీలియం వాయువు తప్ప తక్కిన వాయువులన్నిటినీ, ద్రవరూపంలోనూ ఘనరూపంలోనూ సాధించగలిగారు. కాని హీలియంను ద్రవీభూతం చేయటం కుదరలేదు.

ఆతర్వాత డచ్ శాస్త్రజ్ఞులు, శీతలపరిస్థితులు కల్పించి ఆనాటి శాస్త్రీయవిధానాలనే బాగా పరిణతికి తెచ్చి, -454° డిగ్రీలు (ఫారన్‌హీట్) వద్ద హీలియంను ద్రవంగా మార్చగలిగారు. ఆ ద్రవాన్ని మరికొంత చల్లబడవేయగలిగారు. తక్కిన ద్రవాలన్నీ ఘనరూపం అందుకొనే ఆ శీతల పరిస్థితిలో, ఈ హీలియంద్రవం, అపరూప ద్రవంగా నిలిచి, బహువిచిత్రంగా ప్రవర్తించటం మొదలుపెట్టింది. ఈ ద్రవంపై భూమ్యాకర్షణశక్తి పనిచెయ్యదేం అన్నట్లు పైకి ఎగబాకటం ప్రారంభించింది. ఒక్క శతాంశము చిరువెచ్చదనం తగిలితే, చిచ్చుబుడ్డిలాగా బుస్సని విరజిమ్ముతుంది. గాలి ఆడనంత గట్టిగా బిగించిన పాత్రలో కూడా మూతలను ఛేదించుకొని పైకి పొంగివస్తుంది. ప్రకృతిలోని భౌతికశాస్త్ర ధర్మాలు ఏవీ ఈ ద్రవంమీద పనిచేయనట్లే ఈ ద్రవం సంచరిస్తుంది.

ఈ శాస్త్రజ్ఞులే, పాదరసాన్ని బాగా

(38 పేజీ చూడుడు)

# భారతీయ నాగరికతను అలవరుచుకున్న ఇండొనీషియా వ్యవస్థ

జీవితంలో ఎన్నడూ చూడని, ముఖాముఖం ఎరగని అపరిచిత వ్యక్తిని మొట్టమొదటిసారి చూసీచూడగానే పరిష్వంగం చేసుకోడం సంభవమేనా? ఇండోనీషియా రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ సుకర్నో ఢిల్లీ వచ్చినప్పుడు అది సంభవించింది. కట్టుకథల్లో చెప్పినట్టు అజ్ఞాతంలో పుట్టి పెరిగిన సహోదరుని గురించి అనోటా అనోటా విని చిరకాలానికి చూసే తరుణం వచ్చినప్పుడు ఇటువంటిది సంభవిస్తుంది.

భారతజాతీయోద్యమకథలు, ప్రపంచచరిత్రలోని జాతీయస్వాతంత్ర్యసమరాలవృత్తాంతాలు రక్తాన్ని ఉడుకెత్తించగా, స్వజాతి దాస్యశృంఖలాల్ని త్రెంచుకోడానికి ఇండోనీషియాయువకులు ఉద్యమం ప్రారంభించారు. భారతదేశంలో గాంధీజీ పేరు జాతీయ చైతన్యానికి తారకమంత్ర మైనట్లుగా, ఇండోనీషియాలో సుమత్రాద్వీపం మొదలు తైమర్ న్యూగినీ ద్వీపాలవరకూ "మర్దేకా" (స్వాతంత్ర్యం) అనే నినాదం సముద్రాంతరాలు దాటి పట్టణాల్లో పల్లెల్లో, పర్వతాల్లో



ఎనిమిదికోట్ల ఇండోనీషియాప్రజలకు "మర్దేకా" నినాదంతో జాతీయ చైతన్యమిచ్చిన నాయకుడు అబ్దుల్ రషీద్ సుకర్నో.

అరణ్యాల్లో ప్రతిధ్వనించింది. ముప్ఫయ్యొక్క వందల ద్వీపాల్లో నివసిస్తూ పదహేడుభాషలు, రెండువందల మాండలికపరిభాషలు మాట్లాడే ఎనిమిది కోట్ల ప్రజల్లో జాతీయైక్యతాభావం ఉప్పొంగి దాస్యశృంఖలాల్ని ఛేదించింది. సర్వసంపత్సమృద్ధమైన స్వతః భారతదేశంవలెనే రాజకీయదాస్య ఫలితంగా దుర్భరదారిద్ర్యం, జాతీయభావం లోతుగా పాతుకున్నాయి యీ ద్వీపసమూహంలో.



భారత రిపబ్లిక్ అవతరణమహోత్సవాలకు ఢిల్లీవచ్చినప్పుడు ఇండోనీషియా అధ్యక్షుడు డాక్టర్ సుకర్నో ప్రధాని నెహ్రూను ఆలింగనం చేసుకుంటున్నారు.

# ఇండో నీషియా

ఇంటింటా అరటిమొక్కలు మల్లెపందిళ్లు పొగడపొదలు మందారమొక్కలతో ఊరూరా చెరువులు, మామిడితోపులు తాటి, తుమ్మతోపులు చింత, ఎర్రగన్నేరు, తంగేడు, జువ్వి మొదలైన చెట్లతో కళకళ లాడే మన పూర్వగ్రామ్యజీవనాన్నీ, నిత్యం పచ్చతోరణమై వెలసిన మన పూర్వభారతీయనాగరికతనీ, మళ్లీ కనులారా చూడాలంటే యవద్వీపసమూహానికీ థాయిలండ్‌కీ వెళ్లవలసిందే నంటారు. మన దేశంలో ఆ పచ్చనితనం శ్రావణ భాద్రపదాలలో బంతిపూలతోపాటు ఒకసారి లీలగా కనిపించి మాయమైపోతుంది. హిందూగ్రామజీవనమాధుర్యం ఇంకా ఇండోనీషియాలో లభిస్తుందట.

హిందూమహమ్మదీయ సభ్యతా సమైక్యత అక్కడే సార్థకమయింది. జపాన్ సైన్యాల ఆక్రమణ, గొరిల్లాయుద్ధాలు, రిపబ్లికన్ల స్వాతంత్ర్యపోరాటాలవల్ల కొంతవరకూ ఇండోనీషియా జాతీయార్థిక పరిస్థితి క్షీణించిపోయినప్పటికీ, పల్లెజీవనంలోని శాంతిసుఖాల్నీ, తృప్తినీ పచ్చదనాన్నీ మాయం కాలేదు. అనేక శతాబ్దాలై యవద్వీపసమూహంతో మన సంబంధబాంధవ్యాలు తెగి దూరమైపోయినప్పటికీ, ఉభయజాతులకూ సాధ్య సహోదరభావం ఒకటి అజ్ఞాతంగా అలానే ఉండిపోయింది. ఉభయజాతులకూ మధ్య గల ఈ సహోదరభావాన్ని పెంపొందింపజేసి సాక్షాత్కరింపచేసుకోడానికే మన ప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఇండోనీషియా సంచారానికి వెళ్లారు. వెళ్లినచోటెల్ల "బంగ్ నెహ్రూ" ను (సహోదరుడు నెహ్రూను) ఇండోనీషియా ప్రజలు ప్రేమాదరాలతో సమ్మానించారు. పండిట్ నెహ్రూ పేరు చెప్పితే భారతదేశంలోనే కాదు, ఆసియా అంతటా ప్రజలు వేలు లక్షలుగా చేరి భక్తి ప్రకటిస్తారు. గాంధీ నెహ్రూలు లోకబాంధవులైనారు.

భారతదేశానికీ ఇండోనీషియాకీ అనేక విషయాల్లో సారూప్యం ఉంది. భారతదేశంలో కాశ్మీర్ నేపాళదేశాలమొదలు కన్యాకుమారి అగ్రంవరకూ హిందువులందరికీ రామాయణంపట్ల భక్తిప్రేమలు అధికం. బౌద్ధసిద్ధాంతాలపట్ల గౌరవాదరాలు అపారం. ఇండోనీషియాలో బలిద్వీపంలోని "బ్రాహ్మణమతస్థులకే" కాక, మహమ్మదీయులందరికీ కూడా రామాయణం పట్లనూ, బౌద్ధమతం పట్లనూ అపారమయిన ప్రేమాదరాలున్నాయి.

ఉభయదేశాల నాగరికతా పల్లెజీవనంలో

(22-వ పేజీ చూడుడు)



కపంగ్ — కపంగ్: — హస్తరేఖలు, పదవిన్యాసం, సున్నితభావప్రకటన, మందగమనం కల ప్రత్యేకనృత్యం. దాదాపు మన భరతనాట్యాన్ని పోలి ఉంటుంది.

ల్లో చుట్టూ కొబ్బరి, తాటి చెట్లతో ఇటువంటి వరిచేలు ఎక్కడ కనిపిస్తాయి. అలాగే ఇండొనీషియా అంతటా కూడా

తీర్చిన పెంకుటిళ్ళు, సుమత్రా. యుద్ధం చెయ్యడానికి రాటం పెట్టి తగవు తీర్చి అనేక ప్రాణాల్ని కాపాడిన ఒక మృతిచెందిన ఎద్దుకు చిహ్నంగా కొమ్ములరూపంలో పెంకుటిళ్లు

త్రాద్వీపంలో మూసినదైన ఒక వస్తీ. లంగరు వేసిన ఇళ్లు. పడవలకి బోట్లు ఉపయోగిస్తారు.

యొద పూరిళ్లు: బలిద్వీపంలో ఒక రైతుఇల్లు.

కం : మన పల్లెవాసులకు వలెనే ఇండొనీషియా పల్లెవాసులికి ట్రలూ పూనుతాయి. కత్తుల్తో పొడుచుకునేవరకూ వస్తుంది. కొ సంభవిస్తాయి. ప్రక్కనుండేవారు ఆరత్తాళ్ళి అద్ది, మం ర యాలపైన కడతారు.

ద్వీపంలో శైలేంద్రవంశపాలకులచే నిర్మించబడిన బుద్ధశిలా పీ అగ్నిపర్వతం దూరంలో కనబడుతుంది. ఈ స్తూపం నిది.

[ఛాయాచిత్రాలు "లైఫ్" పత్రికనుంచి]








# ఇండొనీషియా

(19-వ పేజీ తిరువాయి)

రాణించింది. సర్వసంపత్సమృద్ధమయినప్పటికీ దుర్భరదారిద్ర్యం అనుభవిస్తున్నాయి. పల్లెజీవనం, పల్లెల పచ్ఛదనం ఉభయదేశాల్లోనూ క్రమక్రమంగా అంతర్ధానమౌతున్నాయి. వడ్రంగి, కుమ్మరి, చాకలి సాలి, కమ్మరివృత్తులు ఒకప్పు డుచ్ఛదశకు వచ్చి, ఇప్పుడు క్షీణిస్తున్నాయి. ఆ వృత్తుల గౌరవం క్షీణించిపోతోంది, ఉభయదేశాల్లోనూ అనాదినుంచీ పండితపామరులకు వినోదం చేకూర్చిన పురాణకథాకాలక్షేపాలు, తోలుబొమ్మలాటలు, దేవతల ఊరేగింపులు, ఉత్సవాలు, దేవతల పూనకాలు, జ్యోతిష్కులు, సోదె చెప్పేవాళ్లు, భూటాజాలు, మంత్రగాళ్లు, గారడీవాళ్లు, ఇంద్రజాలం, నాలికవైద్యాలు, బలప్రదర్శనాలు, కోడిపందాలు, పొట్టేళ్ల పోటీలు, మొదలైనవి క్రమక్రమంగా అంతర్ధానమై ప్రజలకు ఆధునికజీవనవిధానం అలవడుతోంది. ఉభయదేశాల్లోనూ ఎక్కడచూసినా మహానగరాల్లో కాని కుగ్రామాల్లో కాని పూరిళ్లు పెంకుటిళ్లు కానవస్తాయి. వరిచేలు, ఎద్దుల నాడ్చి కర్రనాగళ్లతో దున్నిన భూమి, గుబురుతోటలు, మహావృక్షాలు, రెండెడ్ల బళ్లు, ఒంటెద్దుబళ్లు, పాడిపశువులు, సంతలు, అదే ప్రశాంతగ్రామజీవనాన్ని సాక్షాత్కరింపచేస్తాయి. పొంగుబుగ్గలూ మెరిసే చిన్నకళ్లూకలిగి పొట్టిగా ఉండే ఇండొనీషియన్ పల్లెవాసులు అమాయకులు.

శైవవైష్ణవదేవాలయాలు, బౌద్ధస్తూపాలు ఇండొనీషియాలోకూడా తరుచు కానవస్తాయి. శిల్పనృత్యాదికళల్లో, జానపదనృత్యగీతాదిరంగాలలో హిందువుల కళలకత్యంత సన్నిహితబాంధవ్యం ఉంది.

ఉభయదేశాల్లోనూ కూడా రాజకీయాలంటే ప్రజలకు జీవనసముద్ధరణసాధకం, నాయకులకు అధికారసముపార్జన పరికరం. కాని మనదేశంలోవలె ఇంకా ఇండొనీషియాలో ప్రజల్లో వారి మూర్ఖఆచారాలనుంచీ నిరర్థకమైన సమాజనియమాలనుంచీ, పరివర్తన పొందడానికి రాజకీయ చైతన్యం కాని సమాజస్థితిగతులపట్ల రోత కాని బలీయం కాలేదు. అందువల్ల ఇంకా ఇండొనీషియాలో ఈ గ్రామీణజీవనం నిరాటంకంగా కొనసాగిపోతూనే ఉంది.

ప్రజల జీవనసముద్ధరణకు ఉభయదేశాల జాతీయనాయకులు ప్రాణాలొడ్డి కృషిచేస్తున్నారు. మన దేశాన్ని విచ్ఛిన్నపరచగలిగిన మతోన్మాదుల ఉద్యమం ఆ దేశంలోనూ ఉంది కాని ఆ ఉద్యమం క్రమక్రమంగా క్షీణించిపోతోంది.

ఆసియాప్రజల స్వాతంత్ర్యచైతన్యానికి ఇండియా ఇండొనీషియాలు పునాదులు. ఈ దేశాలకు పరదేశాల ఆక్రమణ అక్కరలేదు. పరుల సొత్తుపైన కాంక్ష లేదు. జాతీయైక్యతాసాధనా, ఆర్థికసముద్ధరణ ప్రధాన సమస్యలు. ఈ రెండులక్ష్యాల్ని సాధించడానికి ముఖ్యప్రతిబంధకాలు పాశ్చాత్యులూ, కమ్యూనిస్టుల కుట్రలు. ఈ ప్రతిబంధకాల్ని గడవాలంటే ఆసియాదేశాలమధ్య సహకారం, సమైక్యతాభావం సోదరభావం బలపడవలసిన అవసరం ఉంది. అది సాధించడానికే డా॥ సుకర్నో ఢిల్లీ వచ్చి భారత రిపబ్లిక్ ప్రతిష్ఠానోత్సవంలో పాల్గొని మైత్రీభావం ప్రకటించాడు. ఇప్పుడు పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఇండొనీషియా సంచారం చేస్తున్నారు. భారతీయుల మాదిరిగానే అక్కడ కూడా ఇండొనీషి

(38-వ పేజీ చూడుడు)

## ఇండొనీషియా జాతీయనాయకులు



1. ప్రధానమంత్రి డా॥ మహమ్మద్ హటా. సుమత్రాద్వీపవాసి. హేగ్ సమాలోచనల్లో ఇండొనీషియా స్వాతంత్ర్యాన్ని సాధించాడు.



2. జోగ్జకర్తా సుల్తాన్. డచ్చి సైన్యాలతో పోరాడి రిపబ్లికన్ సైన్యాల్ని నడిపి గొరిల్లాచర్యలు నిర్వహించాడు. ఇప్పుడు దేశరక్షణశాఖామంత్రి.



3. బలిద్వీపరాజు అనక్ అగంగ్. తూర్పు ఇండొనీషియా ప్రధానిగా కొంతకాలం ఉండి రిపబ్లిక్ స్థాపనానంతరం కేంద్ర మంత్రివర్గంలో ఆంతరంగికమంత్రిగా పనిచేశాడు.



4. సుతాన్ షహ్రీర్. స్వాతంత్ర్యసమరంలో అత్యంత ప్రధానపాత్ర నిర్వహించినప్పటికీ వ్యక్తివైషమ్యాలవల్ల రాజకీయాధికారం చేకొనలేదు.

# పింగళిసూరన - ఆత్మస్తుతి

## శ్రీ వేదాంతము గోపాలకృష్ణమాచార్యులు

కళాపూర్ణోదయ మొక యపూర్వసృష్టి. ఏ పురాణమునుండియో ఎరువుదెచ్చుకొన్న సొమ్మును సానదీర్చి వీనైన నగసేసిన ప్రబంధకవుల మార్గము వేరు. నాటికాలపు సూరనమార్గము వేరు. ప్రబంధశిల్పమందలి రహస్యమొక కథను తీసికొని యందలి యనౌచిత్యములను సంస్కరించి రసబంధురముగా నునిర్మలన మొనరించుట. ఈ శిల్పధర్మములను పెద్దనాదులు పాలించి యశస్వులైరి. ప్రబంధకవుల సమష్టియశస్సులో సూరనయు ప్రభావతీప్రద్యుమ్న రచనమున పాలుపంచుకొన్నాడు. వాఙ్మయమందనటనట పొడచూపుచువచ్చిన శ్లేషరచన కొక పరిణామరూపము రాఘవపాండవీయము. క్రొత్తపుంతలు త్రొక్కనుబలాటపడు నీకవిబుద్ధి కల్పనాకావ్యమార్గమును త్రొక్కినది. తత్ఫలముగనే సూరకవి మహోజ్జ్వలరోచిఃపూర్ణమణిహార మాంధ్రభారతీగళసీమ నలంకరింపగలిగెను.

అటు సంస్కృతమున కాదంబరియు ఇటు ఆంధ్రమున కళాపూర్ణోదయమును గహనములు. కళాపూర్ణోదయమందేమి ఏ కావ్యమందైనను తన రచనాకౌశలమును కృతిపతిచే చెప్పించుట ప్రాబంధికుని యాచారము. ఆ యాచారమును సూరనయు పాటించినాడు. కాని యింకొక విశేషాచార మవలంబించినాడు. రసికులు కనుగొనునట్లు అటనట తన్నుతా పొగడికొన్నాడు. పాత్రలద్వారా కళాపూర్ణోదయ ప్రాశస్త్యము పాఠకులకు కవి ఎఱిగింపవలసిన యవసరము కల్గినది. దానికి కారణమేమని మనము ప్రశ్నించకొనవచ్చును. తత్క్షణమే సమాధానమును లభించును.

కళాపూర్ణోదయము గహనము. కథావక్రతయే కావ్యమునకు వన్నెదెచ్చునని రామలింగారెడ్డిగారు నిరూపించిరి. అది నూటికి నూరుపాళ్లును నిక్కము. కాని నాటివారేమి నేటివారును విడదీయరాని చిక్కులతో నల్లిబిల్లిగ నల్లుకొన్న చిక్కుడుపాదువలె నున్నదే మీ కథయని యాక్షేపించుచున్నారు. 'ఊహించి తెలియరాకుండ సూరపరాజు శ్రమ గళాపూర్ణోదయము రచించె'నని రామకృష్ణకవి పలికినట్లుగా వదంతి కలదు. రామకృష్ణకవిది కాకపోవచ్చును. నాటి నేటి మధ్యకాలమం దీమాట పుట్టినదను మాట మాత్రము సత్యము. దీనిద్వారా యందలి కథావక్రత యధిక్షేపణకు తావైనదనుట విస్పష్టము.

వేశ్యయగు కలభాషిణి నాయిక యగుటను కొందరు కులీనులు తిరస్కరించియుందురు. అదియును కాక ఆమెకు నలకూబరునందును మణికంధరునందును ప్రేమ నెలకొనియుండు టేమి? ఆమెకు మానసికవ్యభిచారదోష మంటగట్ట కొందరు శుష్కపండితులకు వీలుకలిగినది. కాననే కవి యీ కుశంకల నన్నిటిని కావ్యమందు సమాధానింప వలసివచ్చినది.

అదికాక అందలి శృంగారరససరస్వతి ఆలంకారికనిర్దిష్టమైన రాచబాటపై నడువలేదు. రామలింగారెడ్డిగారన్నట్లు 'గ్రంథకీటకమయి వ్యాకరణసూత్రములను వర్ణించుట వలన నూనెకు నష్టియే కాని కవితకు పుష్టిలేదు.' కాని ఆమాట నాటి పండితులొప్పుకొందురా? అది కలలోని మాట. ఇన్ని కారణములచే కళాపూర్ణోదయ మనాదరణపాత్రమైనది.

సూరనరాఘవపాండవీయమున కున్న ప్రచారము నేటికిని కళాపూర్ణోదయమునకు లేదనుట స్పష్టము. రెండర్థములకై పదములను విఱచి పాండిత్యప్రదర్శనమునకై పలుపాట్లుపడి రచించిన రాఘవపాండవీయమున కంత ప్రచారమేమి? నిసర్గలలితకవితాకుమారీనర్తనశాలయై కథాకల్పనాసౌందర్యశోభితమై చెలువంపుసీమయైన కళాపూర్ణోదయమునకీ గతియేమి? నేటికిని కళాపూర్ణోదయమును కొందరుపండితు లధిక్షేపించుటే సందర్భమున గమనార్హము. రామరాజభూషణునివంటి యుపజ్ఞాశాలి సైతము 'కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము'లని యధిక్షేపించెను. కల్పనకా కాలమున తావు లేదు. అందును యీకథ గజిబిజిగా నుండి విడదీయరాని చిక్కులతో నిండియుండి నాటి పఠితృలోకమున కాహ్లాదము గూర్చియుండక పోవచ్చును. అట్టియప్పుడు తన కావ్యమందలి యపూర్వరామణీయకమును కవి ప్రదర్శింపవలసి వచ్చును. కథను వర్ణనలతో పెంచెడివారు నాటి కవులు. అట్టి వర్ణనలు మచ్చునకైన కళాపూర్ణోదయమునందు లేవు. నాటి కాలమం దిట్టికావ్య మనాదరణపాత్ర మగుటలో నాశ్చర్యము లేదు.

కలభాషిణి అచ్చతరకమనీయజ్యోత్స్నా శీలయని పాఠకులకు చూపట్టుటకై వారికి సహజముగా పొడము శంకల నూహించి సూరన సమాధానించినాడు. నాయికను పాఠకులు మానసిక వ్యభిచారదోష మంటకట్టవచ్చునని సూరన ఊహించినాడు. దానికై కాకపోయినను సుగాత్రీశాలీనుల కథ కల్పించినాడు. సుగాత్రీశాలీనుల కథాకల్పనము అద్భుతావహము. మణికంధరుడు కలభాషిణికి తనయందు నెలకొన్న ప్రేమమును సమర్థించుటకై ఈకథ చెప్పినాడు. కలభాషిణి:—

'శ్రీయుతమైన దివ్యమణి
చేతికి నబ్బగ బాఱవైచి త
చ్ఛాయ యొకింత చిక్కి గని
చాల గృశించితి గాజుపూసకై
నా యవివేక మేమనుకొ
నందుద దన్మణి యబ్బె నన్న న
త్యాయత తత్సమాగమము
భాప్తికి నోచమి నెంచి కుందెదన్'

అని పల్కినది. కామ్యవస్తువు దుర్లభమైనప్పుడు తదాభాస మనిపించుకొను నింకొకవస్తువుపై దృష్టి ప్రసరించుట మానవ సహజస్వభావము. సహజమే కావచ్చును. కాని కలభాషిణి కేల ప్రసరించినది? మణికంధరుడు తన్ను ప్రేమించుచున్నాడా? ప్రేమించుచున్నాడు. నారదుని కనుగవ కప్పు పెట్లు? ఇన్ని శంకలకు సమాధానము లభింపక కలభాషిణి నలకూబరునం దాసక్తి వహించినది. అంతమాత్రమున నాయిక వ్యభిచారిణి కాదని కవ్యుద్దేశ్యము. దానినే పాఠ

కులకు తెరమరుగుననుండి తెలియపఱచినాడు.

గంధర్వకుమారుడు, కలభాషిణీగానకళా సహాధ్యాయి కాబోవువాడు నగు మణికంధరుడు ఆకాశమార్గమున నారదమౌనితో కలసి ద్వారకాపురి కేతెంచుచున్న ఘట్టమది. అతడు ఎలతోటలో నుయ్యాల లూగుచున్న కలభాషిణీశ్యాదులను కాంచి,

'తమిబూనీ గల కూకటుయ్యెలల బం
తాలాడుచున్ నూగు నా
కామగుం బ్రాకుపు గబ్బిగుబ్బెతల యం
ఘ్రుల్ నెక్కగా జాగి మిం
టి నెమ్ముంగంటె చనుదెంచు తీవ గనుగొం
టే దివ్యమౌనీంద్ర! నా
కన్నుగీనేత్రలతోడ గన్యమునకుం
గాల్దా చులా గొప్పెడున్'

అని వర్ణించినాడు. నారదుడు భళిరా యని తల యూచి శిష్యుని భావనాపటిమ నభినందించినాడు. 'తగ న్నావించి' మణికంధరుడు పల్కినది నిక్కమట ! నా దృష్టిలో సూరనయే మణికంధరుడు. ఇట కవి తన భావనాప్రతిభను పొగడుకొన్నట్లు మనము గ్రహింపవచ్చును. పొగడుకొన్నను తప్పేమి? ఈ రెండుపద్యములును సూరన కవితానైపుణికి నిదర్శనములు.

ప్రథమసందర్శనమున శ్రీకృష్ణుని మణికంధరుడు దండకరూపమున స్తుతించినాడు. కలభాషిణి ఏకసంథాగ్రహణమున కృష్ణసాన్నిధ్యమున మరల దండకమును పఠించినది. శ్రీకృష్ణుడు మణికంధరుని కవితాప్రతిభను మెచ్చుకొని తన యమూల్యముక్తాహార మీకవిగళసీమ నలంకరించెను. ఇది సూరనఅనుభవమేమో? నంద్యాలకృష్ణభూపతి ప్రథమసందర్శనమున సూరకవివిజయగీతములను వీనువిందుగా విని తలయూచి మెచ్చి రత్నహార ముపాయనము పెట్టినాడేమో! కలభాషిణి 'పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన లీల......' కవిత చెప్పనేర్చు సత్కవివరునకు వాంఛితార్థము లొసగని వారుండురా అని పల్కినది. ఎలతోటలో నారదునితో దండకమును పఠించి మణికంధరుని కవితాప్రతిభను మెచ్చుకొన్నది. ఇట నాత్మప్రశంసాపరిమళము గుబాళించెడిని.

ఇట్లయ్యెపట్టుల కవి తన్ను ప్రశంసించుకొనుట మనము కనిపట్టవచ్చును. ఇంకొకచో నిట్టిభావమే గుబాళించెడిని. అది అషమాశ్వాసమునందలి యొక ఘట్టము. యతీశ్వరుడు దేవాలయబహిఃప్రాంగణమందలి శిల్పప్రతిమలను కనుంగొని కాంచి పరవశుడై శిల్పిని మెచ్చుకొనుచు వానిని కౌగిలించుకొన్న ఘట్టమది. 'బళిర శిల్పకులేంద్ర! బ్రహ్మను మీటితే పగిది జేసితిర యీప్రతిమ'నని ఆ యతీశ్వరుడు విభ్రాంతుడై శిల్పనైపుణ్యమును మెచ్చుకొన్నాడు. ఇట కవి తన కల్పనాముఖమైన కవితాశిల్పప్రతిభనే యీపట్టున నుతియించుకొన్నాడా అనిపించుచున్నది.

---


నాకు తెలియలేదు (కాని అమ్మకు తెలిసింది!)
పాపాయి ఎందుకు ఏడ్చాడో—




5 నిమిషముల తరువాత:

"ఆశ్చర్యమమ్మా! ఇప్పుడు వాడు ఎంత హాయిగా, తృప్తిగా ఉన్నాడు!"

"పాపాయి ఒళ్లు గర గర లాడుతుంటే ఏడువక ఏంచేస్తాడు! జాన్సన్స్ బేబీ పౌడరు త్వరగా చురుకును తగ్గించును. నీళ్లు పోసిన తరువాత దీనిని ఎప్పుడూ వాడుము!"



అప్పటినుండి అమ్మ సలహాను అనుసరించాను

ఇప్పుడు వాడు చాలా బాగున్నాడు—

జాన్సన్స్ బేబీ పౌడరు వల్లనే!

ప్రపంచమంతటిలో అతి లేత చర్మమునకు కూడ ఉపశాంతిని, హాయిని యిచ్చుటకే జాన్సన్స్ బేబీ పౌడరు ప్రత్యేకముగా తయారు చేయబడినది. అందువల్లనే ప్రపంచమంతటా వివేకవంతులగు తల్లులు దీనిని తమ బిడ్డలకు వాడుచున్నారు.—తమరు కూడా!

ప్రపంచమంతటిలో కెల్ల ఎక్కువ అమ్ముడగు బేబీ పౌడరు!




జాన్సన్స్ బేబీ పౌడరు

Johnson's
Reg. Trade Mark
BABY POWDER

జాన్సన్ & జాన్సన్ తయారు
సోల్ డిస్ట్రిబ్యూటర్లు: ఐ. సి. ఐ. (ఇండియా) లి.

# బాలానందం

# గిరికన్య

శ్రీమతి వి. యల్. సీతాదేవి

పూర్వము ఒక రాజు, రాణీ ఉండేవారు. ఆ రాజు పర్వతరాజు. వారికి ఒక అందమయిన కుమార్తె ఉండేది ప్రపంచమందలి రాణులలో అందమున వాసికెక్కినది ఆ బాలిక. రాజుగారు ఆ బాలికకు 'సారిక' అని నామకరణము చేశారు. సారిక పుట్టుకలోనే ఒక చిత్రమయిన విషయము సంఘటిల్లినది. ఆమెపుట్టుకలోనే ఆమె మెడలో ఒక గొలుసు వేయబడిఉన్నది. ఆగొలుసులోనే ఆమెప్రాణమున్నదని పెద్దలు తెలియజేశారు. అప్పటినుండి ఆమె తలిదండ్రులామె విషయమున బహుజాగ్రత్త తీసికొనిరి.

కొన్ని దినములకు ఆమె పెరిగి పెద్దదయింది. ఒకనాడామెతండ్రి చాల విలువయిన బంగారపు చెప్పుల జతను నది సారిక పుట్టినము నాడు బహూకరించెను.

సారిక తన గొలుసుతోబాటుగ ఆ బంగారు చెప్పులను కూడ విడిచేదికాదు. ఒక నాడు పువ్వులకొరకు సారిక కొండ చరియలవైపు వెళ్ళింది. కొండపైన నడుస్తుండగా ఒక జోడు జారి క్రింద ఎక్కడో పడిపోయింది. సారిక తన వద్ద నున్న జత విడిపోయినందుకు చాల దుఃఖించింది. ఎవరు చెప్పినా వినలేదు. రాజభటులందరు కలసి నెలలతరబడి అడవులన్నీ గాలించినా దొరకలేదు.



చాలదినాలతర్వాత ఒక రాజకుమారుడు వేటనిమిత్తమై ఆ అడవి గుండా పోతున్నాడు. తళతళా మెరుస్తూ పడిఉన్న జోడును తీసి ఇది తప్పక ఏ రాజకుమార్తెదో అయిఉంటుందని జాగ్రత్తచేశాడు. దానిని ఇంటికితీసికొని పోయి రాజకుమారుడు తన తల్లికి చూపించాడు. తల్లి ఆ జోడును చూసి సంతోషించి ఆ జోడు ఏకన్యకు సరిపోవునో ఆమెను తప్పక వివాహమాడవలసినదని చెప్పింది. ఎన్ని దినాలయినా నిజమయిన రాజకుమార్తె కనపడటము లేదు. ఒకనాడు కొందరు మార్గస్థులు ఈ రాజకుమారుని మందిరమునకు విచ్చేసి తమ దేశములో పర్వతరాజున్నాడని వాని కుమార్తె గిరికన్య తన బంగారపు జోడును పారేసుకుందని వినిపించి వెళ్లిపోయారు. వెంటనే రాజకుమారుడు తన తల్లితో నేనుగిరికన్యను చూడబోవుచున్నాను. ఆమెకీజోడును ఇచ్చేస్తా నని చెప్పెను. కాని తల్లి "నాయనా

నీకు బహుమానముగా ఎంతో ధనమిస్తారు. కాని దానిని నీవు అంగీకరించక రాజకుమార్తె నిచ్చి వివాహము చెయ్యమని అడుగు"మని చెప్పెను. సరేనని రాజకుమారుడు బయలుదేరెను.

రాజకుమారుడు చాలరోజులకి పర్వతరాజును చేరగల్గాడు. పర్వతరాజు శుభవార్త విని చాల సంతోషించాడు. బహుమతికోరమన్నాడు. రాజకుమారుడు తనకు కావలసిన బహుమతి రాజకుమార్తే అని బదులు పల్కగా పర్వతరాజు నే నీయలే దానినే కోరితివా అని విచారించాడు. పరవాలేదు పోయి నీకుమార్తెను అడిగిరమ్మని రాజకుమారుడు పంపించాడు. రాజకుమార్తె సంతోషముతో అంగీకరించింది. వీరిద్దరికి అతివైభవముగా వివాహము జరిగింది. ఆఖరిరోజున రాజకుమారుడు సారికను తనతో తీసికొనిపోవుటకు అనుజ్ఞ ఇమ్మని కోరాడు. పర్వతరాజు సరేనని, వప్పుకొని తన కుమార్తె గిరికన్య మెడలోని హారముమాత్రము ఇతరులెవ్వరూ ధరింపకూడదని, ధరించిన యెడల ఆమె చనిపోవునని చెప్పెను. రాజకుమారుడు అన్నిటికి సమ్మతించి గిరికన్యతోసహా బయలుదేరెను.

రాజకుమారుడు ఇంటికి చేరగానే కోడల్ని చూసుకొని రాజు, రాణీ సంతోషించారు. కానీ రాజకుమారునికి ఇంతకుపూర్వ మొక వివాహము జరిగింది. ఆమె 'మాయినా'. గిరికన్య, 'సారికను' చూచినప్పటినుండి ఆమెకు ద్వేషమంకురించింది. సారిక నెలాగయినా చంపవలెనని దురాశ పుట్టింది. కాని ఆమెయెడ ప్రేమగలదానివలె ప్రవర్తించేది. కాలవశాత్తు కొన్నాళ్ళకు రాజకుమారుడు దూరప్రయాణము చేయవలసివచ్చింది. సారికను వారివద్ద విడుచుటకు ఇష్టము లేకపోయినను విధిలేక విడిచాడు. సారికను, ఆమె మెడలోని హారమునువిషయము శ్రద్ధతీసికొనవలసిందిగా తల్లి, తండ్రితో చెప్పి రాజకుమారుడు వెళ్ళెను. సమయము కనిపెట్టి మాయినా ఒకరోజున తన చెల్లెలు సారికను తన యింటికి ఆహ్వానించి ఆమె మెడలోని హారమును దొంగిలించింది. తెల్లవారి చూడగా సారిక నిర్జీవమై పడిఉంది. హారము మాట అందరు మరచిపోయారు. రాజు, రాణీ మిగుల విచారించి చివరకు ఆమెను ఒక గాజుపెట్టెలో అలంకరించి ఒక తోటలో సమాధి చేయుటకు నిశ్చయించారు.

చాలదినములతర్వాత రాజకుమారుడు తిరిగి వచ్చాడు. జరిగినదంతా విని ఎంతో విచారించి సమాధివద్దకు పరుగెత్తాడు. ప్రశాంతంగా నిద్దురబోతున్నట్టుంది సారిక. కాని ఏం లాభం? ఎంతకీ సారిక లేవకపోవడముచే విసిగిపోయాడు. సారిక తన గిరికన్య తనతో సంచరించిన ప్రవర్తనలన్నీ కలలుగా మారినట్టు విలపించాడు. చివరికి రాజకుమారుడు గృహోన్ముఖుడయ్యాడు. కాని ఆరాత్రే ఒక వింత జరిగింది. ఆరాత్రి మాయినా తాను నిద్రబోయేముందు ఆ హారము తీసి దాచింది. వెంటనే అక్కడ సారిక లేచి నిల్చుంది. దాహమేసింది. నెమ్మదిగా దిగి ప్రక్కనున్న చెరువులోని నీళ్లు త్రాగింది. మళ్లీ ఎప్పుడు వచ్చిందో తెలియకుండానే సారిక తన స్థానములో నిర్జీవిఅయింది. ఆ రాత్రే ఒక చక్కని కుమారుని ప్రసవించింది సారిక. ఒంటరితనముచే ఏడుస్తూ పడుకున్నాడా బాలుడు. ఇది జరిగిన కొన్ని దినములవరకు రాజకుమారుడు విచారముచే ఆవైపుకు రాలేదు. ఒకనాడు మళ్లీ పోవలెనని బుద్ధిపుట్టి బయలుదేరాడు. దూరాన్నించే చిన్న ఏడుపు వినిపించింది. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు రాజకుమారుడు. సారిక లేచి చెరువువైపు పోయి నీరు త్రాగుచున్నది. ఒక చక్కని పిల్లవానిని ఎత్తుకుంది. రాజకుమారుడు సారికను కలుసుకున్నాడు. ఇరువురూ ఆనందాబ్ధిలో మునిగితేలిపోయారు. సారిక వారి ఎడబాటు హారము నెవరో తీయుటచే కల్గిన దనియు, తీసినది మాత్రము తెలియదనియు చెప్పింది. కాని తెల్లవార్తుండుటచే అక్కడ ఆమె హారమును ధరించుటచే సారిక వెంటనే గాజుపెట్టెలో నిర్జీవమయిఉంది. వెంటనే రాజకుమారుడు ఇంటికి వచ్చి నౌకర్లను ఇంటిలోనివారందర్నీ పరీక్షించాడు. మాయినామాత్రము తన ఆరోగ్యము బాగాలేదని తన దాసీలను వెళ్ళనీయలేదు. కాని రాజకుమారుడు వప్పుకొనలేదు. రాజకుమారుడు అనుమానించుచునని మాయినా ఆ హారమును దాసీచేతి కిచ్చెను. ఆమె దానినితన చీరక్రింద పెట్టుకొని

(30 పేజీ చూడుడు)

బాలానందం సీరియల్:



మూలం: ట్రెజర్ ఐలండు
రచన: ఆర్. యల్. స్టివెన్సన్

## 1

అనుకరణ:
"నళినీ మోహన్"

నేను చెప్తూన్న ఈకథ జరిగిన నాటికి నా వయస్సు ఎంతో లేదు. పద్నాలుగేళ్లే. సముద్రానికి సమీపంలో మా నాన్న ఒక చిన్న హోటలు పెట్టి నడుపుతూండే వాడు. ఆయనకు చిన్నచిన్న పనులలో సాయం చేస్తూ నేనూ అక్కడే ఉండేవాణ్ణి.

ఒకరోజున ఒక ముసలి 'కళాసు' (పడవ నడిపేవాడు) మా హోటలుకి వచ్చాడు. ఊరికి దూరంగా, సముద్రానికి పక్కనే, ఏకాంతంగా ఉన్న మా హోటలు అతనికి నచ్చింది. అక్కడే మకాం పెడతానన్నాడు. మా నాన్న ఆయనకు మేడమీద ఒక గది ఖాళీచేసి ఇచ్చాడు. అతను తనతో తెచ్చుకున్న పెద్ద కావిడిపెట్టె ఆ గదిలో పెట్టుకుని ఉండిపోయాడు.

ఆతను తన పేరు 'కెప్టెన్ బిల్' అని చెప్పేవాడు. మహామోటు మనిషి. తెగ తాగుతాడు. వచ్చిన రోజునే ఆయన మమ్మల్ని వేసిన ప్రశ్నలు వినేటప్పటికి ఎవరో, తోడివాళ్లకి భయపడి దాక్కునేటందుకు వచ్చినట్లు కనబడింది. ఎవరైనా నావికుడు కుంటివాడు కనక కనిపిస్తే తనకు వెంటనే చెప్పమని నాకు పని పురమాయించాడు. అలా కనిపెట్టిఉండడానికై నాకు నెలనెలా కొంత డబ్బుకూడా ఇచ్చేవాడు.

కొన్ని నెలలవరకూ ఏమీ విశేషాలు జరగలేదు. ఒకనాడు ఇంకో కళాసు ఎవడో వచ్చి, కెప్టెన్ బిల్ కోసం అడిగాడు. ఆవేళప్పుడు కెప్టెన్ ఇంట్లో లేడు. ఎక్కడున్నాడో వెదికివస్తానని చెప్తే ఆకళాసు నన్ను కదలనివ్వలేదు. నాకు భయం వేసింది. ఇంతలో బిల్ వచ్చేడు. అతన్ని చూడగానే బిల్ ఉగ్రుడయ్యాడు. ఇద్దరూ కొద్దిసేపు తగువులాడుకున్నారు. కెప్టెన్ ఆకొత్తవాడిని కొట్టి తరిమివేశాడు. బిల్ విసిరిన ఛురకత్తి మా హోటలు సైను బోర్డుకి తగలడంచేత ప్రమాదం తప్పిపోయింది గాని లేకపోతే ఆ కొత్తకళాసుని తల తెగిపోవలసిందే. కొద్దిలో దాటిపోయాడు. కొత్తవాడు కెప్టెన్‌ను ఏమీ చెయ్యలేదు కాని, ఆ ఆవేశంతో కెప్టెన్‌కు మూర్ఛ ఫిట్ వచ్చింది. ఆ సమయానికి అదృష్టవశాత్తూ డాక్టరు 'లెవిసన్, మా యింట్లోనే ఉన్నాడు. జబ్బుగా ఉన్న మా నాన్నను చూడడానికి వచ్చాడు. కెప్టెన్ మూర్ఛమాట చెప్పగానే ఆయన పరుగెత్తుకు వచ్చి చికిత్స చేశాడు. తెలివి వచ్చాక ఆతడింకెప్పుడూ తాగకూడదనీ, తాగితే ఎప్పుడో ఇల్లాగే పడి చచ్చిపోతాడనీ డాక్టరు లెవిసన్, కెప్టెన్‌కు గట్టిగా చెప్పేడు. అప్పటి మటుక్కి అల్లాగేనని బిల్ తల ఊపేడు. కాని, మానాడా? రెండోరోజునుంచే మా మూలు మోతాదు పట్టించడం ప్రారంభించాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకు మా నాన్నగారు చనిపోయారు. ఆయన చనిపోయిన మూడోరోజున ఒక గుడ్డివాడు దారి అడుగుతూ మా

గుమ్మంలోకి వచ్చాడు. నేను అతని చెయ్యి పట్టుకుని రోడ్డుమీదకు తీసుకుపోబోయాను. కాని వాడు నా చెయ్యిపట్టుకుని రోడ్డుమీదికి బదులు కెప్టెన్ బిల్ దగ్గరికి తీసుకువెళ్లమన్నాడు లేకపోతే చెయ్యి విరిచేస్తానన్నాడు. (ఇంక తప్పింది కాదు. కెప్టెన్‌గదికి తీసుకువెళ్లేను. గుడ్డివాడిని చూసేటప్పటికి కెప్టెన్



పై ప్రాణాలు పైనే పోయాయి. ముఖాన కత్తివాటువేస్తే నెత్తురు చుక్క లేదు. గుడ్డివాడికి ఇదేమీ కనిపించనందునేమో? అతనేమీ మాటాడలేదు. కాని ఒకకాగితం ముక్కమాత్రం కెప్టెన్ చేతిలో పెట్టి, వీధిలోకి వెళ్ళిపోయాడు.

అతనిని వీధిలో వదిలిపెట్టి నేను వచ్చేసరికి కెప్టెన్ చేతిలోని కాగితం చూసి, మహాకోపంతో చిందులు తొక్కుతున్నాడు. దానిమీద ఒక వైపున నల్లటిమచ్చ కానీబిళ్లంతటిది ఉంది. రెండో వైపున "రాత్రి పదిగంటలకి "ఏదో" ఇవ్వకపోతే చంపేస్తామని" వ్రాసిఉంది. అది చదివే కెప్టెన్ అంత ధూంధాంలు చేస్తున్నాడు. ఆ ఉద్రేకం, ఆ ఆవేశంలో అతనికి మళ్ళీ ఫిట్ వచ్చింది. డాక్టరుమాట నిజం అయింది. కెప్టెన్‌కు మళ్ళీ తెలివి రానేలేదు. ఆ ఫిట్‌లోనే ప్రాణం పోయింది.

గుడ్డివాడు రావడం, పదిగంటలకు తనకు ఏదో ఇవ్వకపోతే చంపేస్తాననడం, దానితో అతడు ఫిట్ వచ్చి చచ్చిపోవడం, చూసేసరికి నాకెంతో భయంవేసింది. వెంటనే పరుగెత్తుకుని వెళ్లి మా అమ్మతో చెప్పేను. ఆమెమాత్రం ఏం చేస్తుంది? గుడ్డివాడు తనవాళ్లతో వస్తే ఏమిటీ చెయ్యడం? పిలుస్తే పలికేటందుకైనా దగ్గర్లో ఎవ్వరూ లేరు. కనక ఊళ్ళోకి వెళ్లి ఎవరినైనా తోడు తెచ్చుకుందామని, ఇద్దరం బయలుదేరి, మా హోటలుకి కూతవేటుదూరంలో ఉన్న ఊరిగుడిసెలదగ్గరకు వెళ్ళేం. మా స్థితి ఎవరితో చెప్పుకున్నా వాళ్లు హడలిపోయి ఎవరికి వారే రామంటే రామన్నారు. వాళ్లు ఒక ఉపకారం మాత్రం చేసిపెట్టేరు. ఒక మనిషి నిచ్చి డాక్టర్ లెవిసేకి మా సంగతి తెలుపుతూ కబురు పంపేరు. లెవిసే మా ఊరిమాజస్ట్రేటుకూడాను. ఆయన సాయంవస్తాడు.

అప్పట్లో చేసేదిలేక మా అమ్మా నేనూ ఇంటికి తిరిగి వచ్చాం. కబురందగానే డాక్టరు వస్తాడని మా ధైర్యం. ఇంటికి వచ్చి, మరెవ్వరూ రాకుండా వీధితలుపు గడియపెట్టేం. దొంగలు వచ్చి, కెప్టెన్‌పెట్టెని దోచుకుపోతే మాకు రావలసినబాకీ రాదని అమ్మ భయం. అందుకని అమ్మా, నేనూ మేడ ఎక్కి, కెప్టెన్‌కావిడిపెట్టి తీశాం. ఒక సంచీలో అనేకదేశాలవి వెండి, బంగారం నాణేలున్నాయి. వాటి విలువలు ఎంతో అమ్మకు తెలియదు. 'ఉజ్జాయింపుగా కెప్టెన్ మాకివ్వవలసిన బాకీకి సరిపడుతా' యనుకున్న నాణేలు అమ్మ తీసింది. మిగిలినవాటితో సంచీ పెట్టెలోనే పారేసింది.

ఈ లోపున నేను పెట్టెలో

ఇంకా ఏం ఉన్నాయో నని చూస్తూ, తిరగవేస్తున్నాను. అందంగా కుట్టిన చిన్న తోలు సంచీ చేతికి వచ్చింది. అటూ ఇటూ తిప్పి దానిని ఊడతియ్యబోతూంటే వీధిలోంచి చెవులు గింగుర్లెత్తేలాగ ఈలలు వినబడ్డాయి. మా ఒళ్లు ఝల్లుమంది. దొంగలు రానే వచ్చారు. అక్కడ ఉంటే మమ్మల్ని చంపేస్తారు. కంగారుగా అమ్మా, నేనూ గబగబా కిందికి దిగివచ్చి, తలుపు తీసుకుని వీధిని పడ్డాం. కనుచూపుమేరలో ఎవరూ లేరు. కాని సమీపంలోనే దొంగ లున్నారని మే మెరుగుదుం. తిన్నగా ఊళ్ళోకే వెళ్ళా లని బయలుదేరేం. కాని, అంతవరకూ అమ్మకున్న ధైర్యం అంతా తీరా ఆపదవచ్చే సరికి ఏమయిందో ఒక్క అడుగు వెయ్యలేకపోయింది. దూరాన లాంతరువెలుగు కనబడింది దొంగలు వస్తున్నా రన్నమాట. మేము రోడ్డుమీద కనబడ కూడదు. అందుకోసం అమ్మను నెమ్మదిగా రోడ్డుపక్కకు నడిపించి, దగ్గరలోనే ఉన్న తూముకింద కూర్చోబెట్టి, నే నో మూల నక్కేను.

మేము అనుకున్నట్లు గా ఆ లాంతరు దొంగలదే. గుడ్డివాడి వెంట మరోఇద్దరు వచ్చారు. వాళ్లిద్దరూ ఇంట్లో జొరబడ్డారు. గుడ్డివాడుమాత్రం వీధిగుమ్మంలో నిలబడి వాళ్ళకి ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. ఇంట్లోజొరబడ్డవాళ్ళి ద్దరూ కొంతసేపు పెట్టెలూ, బేడలూ తల్లకిందులు చేసి తిట్టు కుంటూ బయటికి వచ్చారు. ఏదో దొరకలేదని గుడ్డివాడితో చెప్పేరు. ఇంక వాడు చేసిన గంద్రగోళం, తిట్టినతిట్లూ చెప్పలేము. ఆకోపంతో చేతిలో ఉన్న కఱ్ఱతీసుకుని వాళ్లని కొట్టడానికి తరిమేడు కూడాను.

ఇంతలో రోడ్డువెంట కొన్ని గుఱ్ఱాలు పరుగెత్తివస్తున్నచప్పుడు విని, గుడ్డివాడిని వదలిపెట్టి మిగిలిన వా ళ్ళిద్దరూ పారిపోయేరు. గుడ్డి వాడు కంగారుపడి, రోడ్డుమీదనే అటూ ఇటూ పరుగెత్తేడు. వాడిని చూసి, రౌతులు గుఱ్ఱాలని ఆప డానికి ప్రయత్నించేరు. కాని, వేగంగా పరుగెత్తివస్తున్నాయేమో, ఒక్కసారిగా ఆగలేకపోయాయి. గుడ్డివాడు వాటికాళ్లకింద పడి నలిగిపోయి మాటకూడా ఆడ కుండా చచ్చిపోయాడు.

ఆ రౌతుల్ని చూసేసరికి మాకు ప్రాణం లేచివచ్చింది. ఊరి వాళ్లు డాక్టరు లెవిసేవద్దకు పంపిన మనిషి దార్లోనే కొందరు పోలీసు వాళ్లు కనిపిస్తే, మా సంగతి చెప్పి వాళ్లని వెంటబెట్టుకువచ్చాడట. ఆపోలీసుల గుఱ్ఱాలకిందనే పడి గుడ్డివాడు చచ్చిపోయాడు.

మా అమ్మని పోలీసుల సహా యంతో ఇంటికి చేర్చాను. కెప్టెన్ మరణం, దొంగలు రావడం, రక్షక భటుల గుఱ్ఱాల కాళ్లకింద పడి గుడ్డివాడు నలిగిచచ్చిపోవడం, మేజస్ట్రేటుకి చెప్పాలికదా? రక్షక భటులనాయకుడు నన్నుకూడా తనతో రమ్మన్నాడు. అందరం కలిసే డాక్టరు లెవిసేఇంటికి వెళ్ళేం. మేం వెళ్ళేసరికి ఆయన ఇంట్లోలేరు. జమీందారుగారింటికి వెళ్ళే రన్నారు. అందరం అటు బయలు దేరేం.

జమీందారు 'ట్రలానీ' మేజ స్ట్రేటు 'లెవిసే' లు మా కథ విన్నారు. రక్షకభటులని పంపేశారు. నన్నుమాత్రం ఉండమన్నారు.

దొంగలు వచ్చి వెతికినది నా చేతిలో ఉన్న తోలుసంచీ కాదుగదా అన్న అనుమానం మొదటినుంచీ నన్నుపీడిస్తోంది. కెప్టెన్ పెట్టెలోంచి తీసి, తోలు సంచీని పరీక్షిస్తుండగా ఈలలు విని పించి మేము పారిపోయాంగదూ? అప్పటినుంచీ అది నా చేతిలోనే ఉంది. దానిని ట్రలానీ ఇప్పుడు నా చేతిలోంచి తీసుకుని, విప్పి, తీసేడు. లోపలనుంచి ఒక చిఠాపుస్తకం, పెద్దమ్యాపూ బయటపడ్డాయి.

ఆ చిఠాపుస్తకం కెప్టెన్ఫ్లింట్ అనే ఓడదొంగలనాయకుడిది. అతడు ఎప్పుడెప్పుడు ఎంతెంతధనం దోచినదీ దాంట్లో వ్రాసుకున్నాడు. ఆ సొత్తునంతనూ అతడు ఒక దీవిలో పాతివేశాడు. ఆ దీవిదే ఆ మ్యాపు. ఎక్కడ నిధిని పాతి పెట్టాడో, ఆ దీవికి ఎల్లా వెళ్ళాలో చెప్తూ మ్యాపుకి రెండోవైపున కొన్ని సూచన లున్నాయి.

ఇంక సందేహ మేముంది? ఆ మ్యాపుకోసమే ఇప్పుడు ఒక గుడ్డి వాడూ, పూర్వం ఓ కళాసూ ప్రయత్నం చేశారు. దీనికోసమే కెప్టెన్ బిల్ రహస్యంగా దాగు కున్నాడు. అంతా అర్థంఅవుతూనే వుంది.

మ్యాపునూ, కెప్టెన్ ఫ్లింట్ లెక్కలనూ చూసేక ఆనిధిని తీసి తెచ్చుకోవాలని జమీందారుట్ర

లాసీ, డాక్టరు లెవిసేలు నిశ్చయించుకున్నారు. ఆ ప్రయాణంలో నన్నుకూడా రమ్మన్నారు. ఇంటి దగ్గర అన్నీ సర్దుకొనిరమ్మని, కొంత డబ్బు ఇచ్చి, ఒక బంట్రోతును సాయం ఇచ్చి ఇంటికి పంపేరు. మ్యాపుకోసం వెతికిన దొంగలు, దానిని నేనే తీసినట్లు అనుమానించి నన్ను కొడతారేమోననే నాకు ఒక మనిషిని కూడా తోడిచ్చి పంపారు.

మరునాడే ట్రిలానీ బ్రిస్టల్ నగరంవెళ్ళి ఒక ఓడను కొని, సరంగులనీ, కళాసీలనీ కుదుర్చుకుని రావాలని నిర్ణయంచేశారు.

నిధికోసం బయలుదేరతూన్న మాట నాలుగోమనిషి చెవికి చేర కూడదని గట్టిగా కట్టడిచేసుకుని, అందరం విడిపోయాం. ట్రిలానీ బ్రిస్టల్ వెళ్ళేడు. నేను ఇంటికి వెళ్ళేను.

---

# గిరికన్య

(26-వ పేజీ తరువాయి)

వచ్చెను. రాజకుమారు డది గ్రహించి ఆమెవస్త్రములను బెరికించెను. వెంటనే ఆ హారము గల్లున క్రిందపడెను. రాజకుమారుడు మాయినాను, దాసీనికూడా బంధించెను. రాజకుమారుడు వెంటనే హారము తీసికొని సమాధి వద్దకు వేగముగ బయలుదేరి వెళ్ళెను. రాజకుమారుడు హారముతో సారిక మెడను అలంకరించెను. సారిక కన్నులు తెరచి చూచింది. రాజకుమారుని వెన్వెంటనే రాజా రాణీ ఏడుస్తూ వచ్చి తాము చూస్తున్న దృశ్య వారిదీవనల నందుకుంది. అందరు మున కచ్చెరునందిరి. సారిక తన సంతోషముగా గృహోన్ముఖు కుమారుని రాణిచేతులలో పెట్టి ులయ్యారు.

---


# డాల్డాతో

## రుచికరమైన బాలుషాహీలను తయారు చేయండి



మూడు బాలుషాహీలను తయారుచేయుటకు రెండు టేబిల్ స్పూనుల డాల్డాను ఒక గిన్నెడు మైదాపిండితో బాగా రుద్ది పిండిముద్దను తయారుచేయండి. తరువాత చదునైన గుండ్రపు ముద్దలను తయారుచేసి ఒక్కొక్కదానిమధ్య గుంటచేయండి. వేచేటందుకుగాను డాల్డాను ఒకమూకుడులో వేడిచేసి దానిని నిప్పునుండి తీసివేయండి. ఈ గుండ్రటి ముద్దలను దానిలో మెల్లగా వేయండి. డాల్డా కుతకుతమని ఉడుకుట నిలిచిపోగానే మూకుడును మరల నిప్పుమీద పెట్టండి. ఈ గుండ్రటి ముద్దలు ఉబ్బేటంతవరకును మరియు పరిసమానముగా గోధుమవర్ణమును పొందేటంతవరకును మూకుడును నిప్పునుండి తీయుచు మరల పెట్టుచు యుండండి. తరువాత ఈ ముద్దలను రంధ్రములున్న తట్టలో పెట్టి వేడిగానున్న చిక్కని పాకమును వాటిమీద పూయండి. తరువాత వాటిని చల్లార్చండి.

డాల్డా శాకములనుండి తయారుచేయబడిన ఒక శుద్ధ క్రొవ్వుపదార్థమగుటచే చాలకాలము వండినప్పటికి నిలబడును. ఇందువలన ఆహారములు సరిగా అగుటకు ఎంతకాలము కావలెన్నో అంతకాలము వండనిచ్చును.




ఏ ఆహారములు మీ రక్తమును అభివృద్ధిపరచును?

ఉచిత సలహాకొరకు ఇవ్వాళో—లేక ఏరోజైనను వ్రాయండి!

## ది డాల్డా అడ్వైసరీ సర్వీస్

పోస్ట్ బాక్స్ నంబరు 353, బొంబాయి 1

HVM. 119-172 TL

# మూడు ప్రశ్నలు



శ్రీమతి బొడ్డుపల్లి మహాలక్ష్మి

పూర్వం ఒక రాజుండేవాడు. అతని క్రింద చాలామంది సామంత రాజులుకూడా ఉన్నారు. అందులో ఒక సామంతరాజు అసలు రాజుకంటె చాల దర్జాగా ఉండేవాడు. అతడు రాజుకు తెలియకుండ కొంత సైన్యాన్ని కూడా కలిగియున్నాడు. అతని దర్బారులో కవులు, గాయకులు, చిత్రకారులుకూడా ఉన్నారు అతని అంతఃపురవైభవం ముందు రాజుగారి వైభవం సూర్యుని ముందు దివిటీ నుంచినట్లే.

తన సామంతుడు ఇంత వైభవంతో జీవించటం రాజుగారికి తెలిసింది. ఆయనకు కళ్లు కుట్టాయి. "ఏమిరా! నన్నాశ్రయించుకొని బ్రతికేవాడికి ఇంత దర్జా! కవులు, గాయకులు, చిత్రకారులుకూడానా! అంతేగాక నా ఆజ్ఞను ధిక్కరించి సొంత సైన్యాన్నికూడా పోషిస్తున్నాడా!! చూచుకో వీడ్ని ఏం చేస్తానో!" అని కోపావేశంతో వెంటనే ఆసామంతుడ్ని రావించి మరణదండనం విధించాడు రాజు.

సామంతుడు రాజాజ్ఞ విని దిగ్భ్రమ చెందాడు. ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. "ప్రభూ! నే చేసిన అపరాధం ఏమిటి?" అని రాజు రెండుకాళ్లూ పట్టుకొన్నాడు. రాజుకు కనికరం కలిగింది. సామంతుడు చేసిన తప్పిదాన్ని వివరించి రాజు, "నిన్ను మూడు ప్రశ్నలడుగుతాను. వానికి సమాధానం చెప్పు! లేకపోతే నీతల అప్పుడు తీయిస్తానులే!" అన్నాడు. ఆమూడు ప్రశ్నల్ని రాజుగారిట్లు చెప్పారు. "(౧)నే నెంత విలువ చేస్తాను? (౨)ఈభూమిని చుట్టి రావటానికి నా కెంత కాలం పడుతుంది? (3) నేను నా మనసులో ఏమి ఆలోచిస్తున్నాను?"

సామంతుడు ఈ గడ్డుప్రశ్నలకు బదులు చెప్పటానికి కొంత కాలం



వ్యవధి కోరాడు. రాజుగారిచ్చారు.

సామంతున కేమీ సమాధానాలు తోచలేదు. అనేక పండితుల్ని దర్శనం చేశాడు. వారికీ జవాబులు తట్టలేదు. నిర్ణీతసమయం సమీపిస్తున్నది. అతనిగుండెల్లో పిడుగులు పడుతున్నాయి.

ఈ ఆలోచనలతో సే సామంతుడు విచారవదనంతో ఊరు బయట ఒక చెట్టుక్రింద కూర్చొని ఉన్నాడు. ఆసమయంలో ఒక గొర్రెలకాపరి ఆదారిని పోతూ దేవరవారిని చూచి విచారంగా ఉన్న కారణం ఏమిటో వివరించమని కోరాడు. సామంతుడు, "గొర్రెలకాపరికి చెప్పి ఏం ప్రయోజనం? మహామహా పండితులే నన్ను పరిష్కరించలేక పోయారు కదా!" అని నిర్లక్ష్యంగా మిన్నకున్నాడు. కాని వాడు చెప్పేదాకా వదిలిపెట్టలేదు. చివరకు విసిగి సామంతరాజు తన బాధను గొల్లవానికి వివరించాడు. "ఈప్రశ్నలకేనా యింత విచారం!! మీ దుస్తులు నాకివ్వండి. ప్రశ్నలకు జవాబులిచ్చి తమ ప్రాణాలు కాపాడుతాను" అని

ఆశ్చర్యం కలిగేటట్లు అన్నాడు. సమయం దగ్గరించింది. గొల్లవాడు సామంతుని వేషం దాల్చి, గుఱ్ఱం మీద రాజుగారి సన్నిధికి వెళ్ళాడు.

సామంతుని రాకకై రాజు నిరీక్షిస్తున్నాడు. రానేవచ్చాడు సామంతుడు.

"రాజా వందనాలు! తమ ప్రశ్నలకు సమాధానాలు విన్నవిస్తా" నన్నాడు సామంతుడు వినయంతో. రాజుగారు అంగీకారసూచకంగా తలాపంకించాడు.

"తమరు ఆకాశంలో నడవ గలిగితే చంద్రుడని లోకమంతా భావిస్తుంది. (రాజు అంటే చంద్రుడనే అర్థ ముంది కాబట్టి) అని మొదటిప్రశ్నకు సమాధానం యిచ్చాడాతడు.

రాజుగారికి ఏమంత నచ్చలేదు ఈ సమాధానం. అయినా ఇంకా రెండు గడ్డుప్రశ్న లున్నాయిగదా! అని మిన్నకున్నాడు.

"తమరు సూర్యుని రథహాయములతో నేగంగల గుఱ్ఱాలు కట్టిన రథా న్నెక్కితే ఇరువదినాల్గుగంటలలో భూమిని చుట్టుముట్టి వస్తారు" అని రెండోప్రశ్నకు సమాధానం చెప్పాడు. సామంతుడు.

ఇది కొంతవఱకు నచ్చింది రాజుగారికి. "సరే! మూడవ ప్రశ్నకు సమాధానం చెప్పు, నీ తెలివి చూద్దాం!" అన్నాడు రాజుగారు మందహాసంతో.

"చిత్తం. తమరు, నేను మీ సామంతుణ్ణనే భావిస్తున్నారు. నేను మీసామంతుడి గొల్లవాడ్ని" అని అతడు నిజస్వరూపం చూపించాడు.

రాజుగారు ఆశ్చర్యపడ్డాడు. గొల్లవాని చాకచక్యానికి సంతోషించి, అతడ్ని, అతనిసామంత రాజుని రక్షించాడు.


## గర్భ నిరోధిని

శరీరారోగ్యమునకు భంగంలేకుంటె కొంత కాలమువరకు గర్భం రాకుండ ఆపుటకు ఔషధం రు. 10 లు. చాలాకాలంవరకు రాకుండ చేయుటకు రు 25 లు. వి. పి. చార్జీ రు 1-0-0

డాక్టర్ రత్నం సన్సు,
మలకపేట బిల్డింగ్సు, హైద్రాబాద్, దక్కన్




త్రివేంద్రం బహిరంగసభలో జూన్ 1-వ తేదీన భారతప్రధాని నెహ్రూ బహిరంగసభలో ఉపన్యసించినప్పటి చిత్రం.

## తెరచాటు

(14-వ పేజీ తరువాయి)

నికి నేను దోషిని కాను. ఎందుకంటె అవకాశంకోరకు ఎదురుచూస్తూండగానే, పెళ్లివారు వస్తున్నారన్న ఖబురు నన్ను చేరింది.

నిస్పృహతో, నిరాశతో క్రుంగిపోయాను. కాని నిబ్బరంగా ఆలోచించుకునే స్వభావం మా నాన్నగారిదగ్గరనుంచి మాకందరికీ అలవాటయింది. నా చిన్న చదువును, అందులోని సారాంశాన్ని దానికి వినియోగించాను. అప్పుడు నాకు సమాధానం దొరికి, నన్ను సమాధానపరచింది. అవును! ఎంతమంది భారతీయకన్యలు, తాము కోరినవారిని విడిచి, కులమతగౌరవాలకై యితరులను చేపట్టలేదు? నేనూ అటువంటి భారతనారినే. వారి సాంప్రదాయాలను గౌరవించి, పెద్దల అడుగుజాడలలో నడవవలసిందే!.

మా మేనత్తసహకారంతో పెండ్లిచూపులకు తయారయ్యాను. నియమితసమయానికి పెళ్లివారు వచ్చారు. నన్ను సావడిలోకి రమ్మని నాన్నగారు ఖబురుపంపారు — ఆశతో తెరచాటుగుండా ఒకసారి అవతలకు చూచాను—కనీసం ఈ ఆఖరిక్షణంలోనైనా జగన్నాథ్ వచ్చి సాయపడుతాడని, ఎక్కడో నా హృదయకుహరంలోనుంచి కేక వినపడుతోంది. నిర్జీవమైన రోడ్డును చూచేసరికి ఆ కేకసవ్వడికూడ అంతర్ధానమయిపోయింది.

నిమ్మదిగా తల వంచుకొని సావడిలోకి వెళ్లి కూర్చున్నాను. పావుగంటదాక పెద్దలందరూ గుక్క తిప్పుకోకుండా, ఆ పెళ్ళికుమారు నాకూ, నన్ను పెళ్ళికుమారునకూ పరిచయంచేస్తున్నారు. మౌనంగా, తల వంచుకుని వింటున్నాను.—నా చెవులు వినడానికి తిరస్కరించినా, ఆపరిచయంలో ఎక్కడో నాలో ఆశ తిరిగి రేకెత్తింది నిమ్మదిగా పెద్దలు మాటలు చాలించినతరువాత, తల ఎత్తి చూచాను—అతడు జగన్నాథ్!!

నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. అప్రయత్నంగా నా కంటివెంబడి నీరు ప్రవహించింది. ఇది చూచి అందరూ తెల్లబోయారు. మా నాన్నగారు ఖంగారుపడి "ఆదేమిటమ్మా" అన్నారు.

నేను సిగ్గుతో వెంటనే కళ్లు తుడుచుకునేందుకు ప్రయత్నించాను.

వారిలో ఒక పెద్దమనిషి "అ అమ్మాయిని లోపలకు పంపించండి" అన్నారు.

నాలో ఆనందం ఉబ్బెత్తుగా పొంగింది. వెళ్ళి నా గదిలోని సోఫాలో చతికిలబడి, ఒక్క నిముషం విశ్రాంతిగా ఏడ్చాను ఆనందంతో. పావుగంటఅనంతరం బయట గుఱ్ఱపుబండి చప్పుడయితే, తెరదగ్గరకు చేరి చాటుగుండా తొంగిచూచాను. పెళ్ళివారు ఎక్కుతున్నారు. చివర కూర్చున్న జగన్నాథ్ అలవాటుప్రకారం కిటికీవంక చూచాడు. సిగ్గుతో ప్రక్కకు తప్పుకున్నాను. బండి వెళ్ళిపోయింది.

+ + +

తలవనితలంపుగా నా ఆశయాలను పరిపూర్తి చేయబోతున్న ఆ విధాతకు ఏవిధంగా నా కృతజ్ఞత తెలియచేయాలో అర్థంకాలేదు. ఇప్పుడు నేను ఒక కవికి, నటకునకు సపత్నిని కాబోతున్నానన్న మాట! నాలో తెలియని ఆనందం అంతులేకుండా పొంగసాగింది. వెంటనే 'సపత్ని తగినది' అని అనిపించుకోవాలని కోరిక కలిగింది. సాధారణంగా కవుల, నటకుల హావభావవిలాసాలు ఒకేవిధంగా వుంటాయి. అందుకని' నాకు అందినంతవరకు వూహించుకుని, దానికి తగిన వాతావరణం నానుంచి ద్యోతమయ్యేటట్లు, నన్ను నేను సంస్కరించుకో ప్రయత్నం సాగించాను. ఒక్కముక్కలో చెప్పాలంటె నేను జగన్నాథ్‌కు ధర్మపత్నిగా భావించుకుని, మానసికంగా అతనితో దాంపత్యాన్ని సాగిస్తూ, ప్రాపంచికలాంఛనమైన వివాహానికి ఎదురుచూస్తున్నాను. మా ఈ భావైక్యతలో, మాకు ఒకవిధంగా, గాంధర్వరీతిని వివాహం అయిందని చెప్పవచ్చును.

కాని నాలో వున్న ఈ తొందరపాటు ఆదుర్దా మా నాన్నగారిలో కనపడడంలేదు. వారిలోకూడ ఈ తొందర ప్రవేశపెడుతే, వివాహం శుభకరంగా సాగిపోతుం దనిపిస్తూ వుండేది. మరి వారిలోకూడ ఆ కోరిక వుద్భవించేటట్లు చేసే దెవరు? మళ్లీ తల్లిలేని కొరత నాకు జ్ఞప్తికి వచ్చింది. మాతృవిహీనమైన సంతానం, ఎంత దురదృష్టవంతమైనదో కదా అనిపించింది.

ఏదోవిధంగా ముందడుగు వేయాలన్న కోరిక కలిగింది చదువుకున్న దాన్ని—నాకు వుపాయాల కేమైనా కొరవా! అందులో కన్యకు వివాహప్రయత్నంలో అంతులేని వింతవూహలు దొరుకుతాయి. నా పెద్దచెల్లెలిని నాన్నగారిదగ్గరకు పంపించాను. నేను చాటుగుండా, గుమ్మందగ్గర సమాధానంకొరకు నిలబడ్డాను.

"నాన్న మరి అక్కయ్యపెళ్ళి ఎప్పుడు? మరిపందిరీ, అవీ వేయించవూ?" అంది.

సావడిలో నాన్నగారు పడకకుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. ఈ ప్రశ్న విని, పేపరు ముడిచి రెండుమూడు నిముషాలు, మౌనంగా వుండిపోయారు. నాలో ఆవేదన ఎక్కువ అయింది. తరువాత

"అమ్మా, అక్కయ్య, బావకు నచ్చాలమ్మా. అప్పుడుగాని పందిరి వేయడానికి వీలు లేదమ్మా" అని ఆ చిన్నదానికి అర్థం అయ్యే భాషలో నెమ్మదిగా అన్నారు.

అప్పుడు నాకు తట్టింది—వివాహప్రయత్నాలకు ఈరోజులలో పెద్దవారి అనుమతి అనవసరమూ, అప్రస్తుతమూ అనీ, వధూవరుల అంగీకారమే ప్రధానమని నాకు అతనితో వివాహము అంగీకారమే. కాని అవరునికి—?

నా అనుమానానికి నాకే నవ్వు వచ్చింది. అతను నన్ను కాదంటాడా? లేకపోతే ఆ తెరచాటునుండి నన్ను ఎందుకు తొంగిచూస్తూండేవాడు? వెంటనే అనుమానంతో నాలో తలఎత్తిన ప్రశ్నను ఒక మొట్టికాయ వేసి దాచివైచాను.

రోజులు గడుస్తున్నాయి. వారిదగ్గర నుంచి సమాధానం యింకా రాలేదు. నా చెల్లెలు అన్నట్లు, యింటిముందర పందిరి వేయడం పడలేదు.

+ + +

అది వేసవికాలము. బాగా పెండ్లిండ్లు జరిగేదినాలవి. ఎటు జూచినా వినవచ్చినా మంగళవాయిద్యాలే. ఒకనాడు హృదయం రోడ్డుచివర నాయుడుగారింట్లో, నా సహాధ్యాయిని పెండ్లిని తెలియబరుస్తూ నాబాజాఖానా సన్నగా వినిపిస్తోంది. సోఫాలో కూర్చుని ఆలకిస్తున్నాను.

ఇంతలో నా చెల్లెలు ఒక కవరు తీసుకుని వచ్చి యిచ్చింది. నాన్నగారి పేరన వుంది. మరి నా చేతికి వచ్చిందేమా అని ఆలోచించి చూచాను. కవరు చించివుండడంవలన, మా నాన్నగారు చూచి నా కిచ్చారని అర్థంచేసుకున్నాను. విషయ మేమిటా అని చూచాను.

"మీ సంబంధం చేసుకోలేనందుకు చింతిల్లుతున్నాము" అని పెళ్ళివారు వ్రాశారు.

రోడ్డుచివర నాబజాఖానాధ్వని సన్నగానే వినిపిస్తోంది ఆ వుత్తరాన్ని మళ్లీ మళ్లీ చదివాను.

ఉవ్వెత్తున దుఃఖమూ, కోపమూ పొంగుకొచ్చాయి.

"ఏమని వ్రాశారక్కా" అంది చెల్లెలు.

అందుబాటులో వున్న చెల్లెల్ని ఒక్క చెంపకాయ వేశాను. ఈ చెడువార్త తెచ్చినందుకు. అది పెద్దపెట్టున ఏడుస్తూ నాన్నగారిదగ్గరకు ఫిర్యాదుకై వెళ్లింది. వెంటనే సిగ్గుపడి నా గదిగుమ్మం బిగించుకుని గుమ్మం ప్రక్కన చతికిలబడ్డాను.

దూరాన్న వినపడుతున్న సన్నాయి ధ్వనులతో పాటు, ఈ ఉత్తరంలోని అక్షరాలుకూడ వికృత ధ్వనులతో వినపడుతున్నాయి—మీ సంబంధం చేసుకోలేనందుకు చింతిల్లుతున్నాము'!!

నాలో విరుద్ధ, వింతభావాలు ప్రప్రథమంగా బయలుదేరి, ఆ పెళ్లివారిని తూలనాడాయి. కాని తామసప్రవృత్తి, చిన్నప్పటినించి, ఉగ్గుపాలతో రంగరించి, మా నాన్నగారు అలవాటుచేశారు. దాని తీవ్రతను నిమ్మదిగా సంబాళించుకోగలిగాను.

ఇక నిమ్మదిగా కారణాలను ఆలోచించుకో ప్రయత్నించసాగాను. ప్రప్రథమంగా, నాన్నగారు చెల్లెలితో అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి. అయితే నాన్నగారు అన్నట్లు నేను ఆ వరునకు నచ్చాలన్నమాట. అయితే నే నాతనికి నచ్చలేదా! నేను అందవిహీనను కానే! వెంటనే, ఎందుకనో, నా అందంపై నాకే శంక కలిగింది. లేచివెళ్లి నిలువుటద్దం ఎదురుగా నిలబడి నా ముఖాన్ని పరీక్షించి చూచుకున్నాను. కన్నీటి చారలతో తడిసిన నా ముఖం మలినమయిపోయి, కళావిహీనమయిపోయింది. అయితే నేను అందగత్తెను కానేమో నన్న శంక, నాలో తెలియకుండా బలీయం అవసాగింది. అయితే ఈ ప్రపంచంలో అందవిహీనలు వివాహానికి అనర్హులా—?...[illegible]గా ఆలోచిస్తే ఎంతమంది అవివాహితలుగా మిగిలిపోతారు?. నా సమాధానం నాకే భయాన్ని కలిగించింది—!

వెంటనే తర్కం నాలో ప్రారంభించి, తిరిగి నూతనప్రశ్నపరంపరలను లేకెత్తింపచేసింది. జగన్నాథ్—ఏం? అతడుమాత్రం అందగాడా? చెప్పుకోదగ్గ అందం లేదే? పైగా కవిత్వం అంటూ, నాటకాలంటూ వెర్రివాడలాగ తిరుగుతూ వుంటాడే. పైగా కవుల, నటకుల శీలాలను పవిత్రం అని చెప్పే అవకాశంకూడ లేదే! అటువంటప్పుడు అతనికి నన్ను తిరస్కరించే అధికారం, అహంభావం ఎక్కడిదీ? నాలాంటి కులీనకన్య పెండ్లికూతురుగా లభించిందంటే సంఘంలో మారని కవులు, నటకులు, నన్ను వెంటనే అంగీకరించి, ఆశతో పెండ్లిచేసుకోవాలే! అయితే జగన్నాథ్ ఈ సదవకాశాన్ని జారవిడుచుకున్నాడన్నమాట. సమయానుకూలంగా అవగాహన చేసుకోలేనంత అమాయకుడన్నమాట!—వెళ్ళిపోతోంది నా మనస్సు లోతుకి యింకా లోతుకి. అతని లోపాలను ఎన్ని వెక్కిరించాలని నా మనస్సు తహతహలాడుతోంది. కాని ఎక్కడనుంచో అందని ద్రాక్షపళ్లు పుల్లగానే వుంటాయన్న సామెత స్ఫురణకు వచ్చింది. వెంటనే సిగ్గుపడ్డాను. నా ఆవేశానికి—

గదితలుపు తట్టారు ఎవరో. వెంటనే, పమిటతో ముఖాన్ని తుడుచుకొని తలుపు తీశాను.—నాన్నగారు వచ్చారు. తలవంచుకుని నిలబడ్డాను. దగ్గరకు వచ్చి నాతల నిమురుతూ—

"అమ్మా! విచారించకమ్మా. జరిగిందల్లా మనమేలుకొరకే జరిగింది. ఆ కథలు వ్రాసుకుంటూ, నాటకాలలో వేషాలువేసే వాడు, నిజానికి నీకు భర్తగా తగడమ్మా! పోనీగాని, రోడ్డుచివరి నాయుడుగారి అమ్మాయి, నీకోసం కారు పంపింది. వెళ్ళిరా అమ్మా" అన్నారు.

"నేను వెళ్లలేను నాన్నా" అన్నాను బొంగురుపోయిన గొంతుకతో.

"కాదమ్మా, మళ్లీ మనం ప్రపంచంలో తిరుగవలసినవాళ్లము. చిన్న ఎదురుదెబ్బ తగిలిందని, గమనాన్ని ఆపుతామా? ముందుకు వెళ్ళవలసిందే. లేచి ముఖం కడుక్కుని వెళ్లిరా, ఆనక నేను వస్తాను" అని సావడిలోకి వెళ్ళిపోయారు.

నాన్నగారి వాక్యాల సారాంశాన్ని అవగాహన చేసుకునేందుకు ప్రయత్నిస్తూ అలాగే కూర్చుండిపోయాను. నిరాశ చెందిన నా ప్రపంచంలో మనం గమనం ఆపకూడదు. నాకు నవ్వు వచ్చింది. ఆ గమనాన్ని వాస్తవికజీవితంలో ఎంతవరకు సాగించగలమా అని ఆలోచించడం ప్రారంభించాను. ప్రశ్నకు సమాధానం దొరకడం

శ్రీ అంబాళ్
ఆఫీసర్స్ నస్యము
No. 1
SRI AMBAL SNUFF
1 తులము టిన్నులలో అన్నిచోట్ల దొరకును.
శ్రీ అంబాళ్ అండు కంపెని,
తపాలు పెట్టె నెం. ౩, మదరాసు.

లేదు. ఎంతసేపు కూర్చున్నానో తెలీదు గాని, బయట కారుహారను మోతతో వులిక్కిపడి, వెంటనే క్లుప్తంగా సింగారించుకుని, రోడ్డుచివరి నాయుడుగారింటికి వెళ్లాను.

నెమ్మదిగా పెండ్లిపందిరి ప్రవేశించాను. పెండ్లి జోరుగా, హడావుడిగా సాగిపోతోంది. నాలో ఈర్ష్య తిరిగి ప్రారంభం కాపోయింది. కాని మనస్సును చిక్కబట్టుకోగలిగాను. పెండ్లిమంటపాన్ని ప్రవేశించాను—

తెరచాటున వధూవరులు, ఒకరినొకరు చూచుకునేందుకు తహతహలాడుతూ కూర్చునివున్నారు. నన్ను ఆ కుటుంబంలోనివారు బాగా ఎరుగివుండడంవలన, పెండ్లికూతురి సహాధ్యాయిని అవడంవలన గౌరవించి కూర్చోబెట్టారు.

ఆ సందిలో కూర్చున్నా నన్నమాటే గాని, నా మానసికతలంపులు విహారంచేయడం ప్రారంభించాయి.

తెరచాటు - ప్రథమంగా ఈ తెరను తొలగించినప్పుడు వధూవరులు ఒకరినొకరు చూచుకుంటారు. అవ్యక్తమయిన భావపరంపర వారిలో ప్రవేశించి, జీవితాంతం వరకూ, వారివారి మనసులలో శాశ్వతంగా వుండిపోతుంది. సంసారం శాంతంగానూ, సారకంతంగానూ జరిగిపోతుంది. అందుకనే ఈ తెరచాటును మన పురాతనసాంప్రదాయాలు పాటించాయి. వాటి ప్రాముఖ్యతను మనం గ్రహించుకోలేక నవ్యభావాలంటూ, అభ్యుదయాంఅంటూ, ఈ పెండ్లి నిశ్చయింపులను, వధూవరుల చిత్తప్రవృత్తులపై పెట్టి సాగిస్తున్నారు.

దీనిని అవకాశంగా తీసుకొని, యుక్తవయస్సురు వచ్చిన వ్యక్తి అయిన యువకుడు, అతని చిత్తవృత్తిని బట్టి సమాధానంయిస్తాడు. ఆ సమాధానాన్ని బట్టి పెండ్లి జరగడంగాని ఆగిపోవడంగాని జరుగుతుంది. అంతవరకు ఈ కన్య, అతని జవాబును ఎదురుచూస్తూ, అమాయికహృదయంతో, హృదయసామ్రాజ్యంలో అతనితో దాంపత్యాన్ని కొనసాగిస్తుంది. కాలకర్మ వశాత్తు చివరకు అతను తిరస్కరిస్తాడు. ఆమె ఊహాలన్నీ గాలిలో మేడలయిపోతాయి. చివరకు ఆమె యింతవరకు మానసికవ్యభిచారాన్ని కొనసాగించిన దవుతోంది. ఆమెక వ్యాత్వమే భంగమయిపోతోంది.

అయ్యో! ఈ పెండ్లిచూపులవలన భారతీయమహిళల శీలమే కళంకమయిపోతోందే, అని తీవ్రవేదన కలిగింది నాలో. ఈ అభ్యుదయభావాలనుకునే నూతనసంఘసంస్కర్తలపై నాకు తీవ్రమైన ఏహ్యభావం కలిగింది. మన వ్యక్తతనే నాశనము చేస్తున్న ఈ అభ్యుదయ, నవీనపోకడలు మన కెందు కనిపించింది. అందుకనే భారతదేశం తిరిగి ఋషిసాంప్రదాయాలను చక్కగా అవగాహనచేసుకొని, వాటిని పాటిస్తే బాగుండు ననిపించింది. వధూవరులను తెరచాటున నుంచి, పెద్దవాండ్రు బాధ్యతాయుతంగా వివాహాన్ని కొనసాగిస్తే, కన్యకు ఈ మానసికవ్యభిచార ముండదు., ఆమెశీలము నిష్కళంకముగానే నిలబడుతుంది. అన్ని కాలాలకు సరిపోయిన సంస్కరణలను అందచేసిన ఆ మహాఋషులకు నా నమోవాకములను అందజేయకుండా వుండలేకపోయాను—

ఇంతలో నన్ను ఎవరో తట్టి పలకరించారు. తేరుకొని చూచాను. నా సహాధ్యాయిని, పెండ్లికూతురు, తృప్తితో కూడిన హాసంతో నన్ను పలుకరిస్తోంది.

"ధన్యురాలవు చెల్లీ, భగవంతుడు నిన్ను సదా రక్షించుగాక!" అని మనస్సులో ఆమెను దీవించాను. వేడుకలయింతరువాత, కారులో నెమ్మదిగా యింటికి చేరి, నా గదిలో సోఫాలో కూలబడ్డాను.

మళ్లీ పాతవాతావరణంలోకి వచ్చి కూర్చున్నాను. ఆగది -కిటికీ తెర- గతచరిత్ర నంతా జ్ఞప్తికితెచ్చి నేను కన్యనను సంగతి తిరిగి స్ఫురింపచేశాయి. అయితే "తాత్కాలికంగా మెరపుతీగవలె వచ్చిన, భావపరంపరలకు గురిఅయి గాయపడిన, సౌదామిని నేను అని అనుకుని కూర్చుండిపోయాను.

అయితే నేను వివాహానికి ఎదురుచూస్తున్న ఒక భారతీయకన్యను అనుకుని, బరువుగా నిట్టూర్చాను. ఈ సంఘటన జరిగింతరువాత కాలచక్రం చాల దొర్లింది. కాని నాలో మార్పు యింకా ఏమీ రాలేదు. ఇంకా ఆగదిలో బందీగానే వుండి, కన్యాజీవితాన్ని గడుపుతున్నాను!

సౌదామిని, తన కోరికలు సఫలీకృతమయి, గృహిణి కావాలన్న కోరికతో ఎదురుచూస్తూనేవుంది. ఆ తెరచాటున!

---

సర్వోత్కృష్టమైన
"కానన్ దేవన్"
టీ మాత్రమే త్రాగండి.
Kanan Devan Tea
KANAN DEVAN TEA
Quality Production
చీఫ్ ఏజంటు: కర్నూలు, అనంతపురం, కడప & చిత్తూరు జిల్లాలకు
కె. ఎ. జోషి, అనంతపురం.
టోకు వ్యాపారస్తులకు విశేష సౌలభ్యము
వివరములకు నేడే వ్రాయండి.

# పేరంటం

ఈ విషయంలో తప్పు మా చెల్లెలుదనే చెప్పాలి. ఆమాటంటే పెళ్లాన్ని వెనకేసుకొచ్చా డంటారు. అసలే రాకరాక మొట్టమొదటిసారి పట్నం వచ్చిన మా రుక్మిణి ఎన్నాళ్లనుంచో అణచుకున్న కోరికను మా ఆవిడదగ్గిర చల్లగా బయటపెట్టింది.

"ఏమండీ, మీ చెల్లెలు సినిమాషూటింగు చూడా లంటున్నదే! పాపం, ఎట్లా?" అన్నది మా ఆవిడ. తాను మూడేళ్లనుంచీ ఉంటున్నా ఇటువంటి కోరిక కోరలేదు అది అడిగినపద్ధతి చూసి దానికికూడా కోరిక పుట్టిందేమో అనుకున్నా.

"అది మనచేతిలో ఉన్న పని కాదే?" అన్నా.

"వీలుంటే చూడండి, పాపం," అన్నది.

"అన్నట్టు నీ స్నేహితురాలు శ్యామల ఉన్నదిగా? తీసుకుపోయి షూటింగు చూపించు," అన్నా.

"ఆ శ్యామలను నేనేమీ అడగను. అది దెక్కడ ఇప్పుడు!" అన్నది మా ఆవిడ.

ఈ శ్యామల అనే సినిమాతార రెండేళ్ల క్రితం మా ఇంటిసరసనే ఉండేది. మా ఆవిడతో చాలా స్నేహంగా కూడా ఉండేది. అయితే, మా ఆవిడ అన్నట్టు, ఇప్పుడావిడకు కొత్త నాలుగు చిత్రాల్లో బుకింగు దొరికి కొత్త ఐశ్వర్యం పట్టింది. ఇప్పటికీ సంవత్సరానికోసారి ఏకొడుకు పుట్టినరోజుకో పిలవటానికి ఆవిడగారు 15 వేల రూపాయలకారెక్కి మా ఇంటికి వస్తూఉంటుంది. కాని ఇప్పుడు మా ఆవిడ ఆవిణ్ణిగురించి నాతో ఆసక్తిగా ఏమీ చెప్పదు.

రుక్మిణి ఒకనాడు నేను వింటుండగానే, "వచ్చి వారమయింది. నే వెళ్లేలోపల పడనే పడదు గామాలు?" అని తనలో తాను అనుకుంటున్నట్టుగా అన్నది.

మా ఆవిణ్ణి చాటుగా పిలిచి, "ఏమి ఉంటుందే? షూటింగు చూసేతీరా లంటుందా ఏమిటి?" అన్నా.

"షూటింగు మాట దేవు డెరుగు. ఆ శ్యామల నన్ను ఒకసారి చూస్తా నంటుందండీ, ఎట్లా!" అన్నది మా ఆవిడ.

"ఏం? తీసుకుపో," అన్నా.

"ఉట్టి పుణ్యాని కెట్లా వెళ్లమండీ? ఇంట్లో ఉంటుందో ఉండదో? ఉండకపోతే రెండు బస్సులు మారి ఈదురోమంటూ రావాలి. దగ్గిరా దాపా? ఓవేళ ఉంటే ఏదైనా పిల్లాడికన్నా పట్టుకు పోవాలా, వద్దా?"

అయిదురూపాయలు చేతిలో పెట్టి, "నీకు పుణ్యం ఉంటుంది. దానికా శ్యామల మొహం కాస్త చూపించేస్తూ!" అన్నా.

రుక్మిణిఅదృష్టం బాగానే పండింది. ఇది జరిగిన రెండోనాడో మూడోనాడో శ్యామలే వచ్చింది మా ఇంటికి. పిల్లాడి పుట్టెంట్రుకలు తీయిస్తున్నదిట. ఇందుకే

శ్రీ

**కొడవటిగంటి కుటుంబరావు**

మా శ్యామల మురిసిపోతుండగా మరో గంటకు మరో సినిమాతారకూడా మా ఇంటికొచ్చింది—ఆవిడ కూతురి పుట్టింరోజుట.

ఈ రెండోతార పేరు మాణిక్యం. ఈవిడ పెద్దతార కాదు. అందుకనే పాతకారెక్కి వచ్చింది. ఎప్పుడో శ్యామలఇంట్లోనే మా ఆవిడతో స్నేహం చేసుకుందిట.

ఇద్దరు సినిమామొహాలవాళ్లు మా ఆవిణ్ణి ఎప్పుడైతే పిలిచారో మా ఆవిడమీద రుక్మిణికి అంతులేని అభిమానం ఏర్పడింది. సాయంత్రం పేరంటానికి బయలుదేరేదాకా రుక్మిణి ఉత్సాహంగా ఉండటమే కాక మా ఆవిణ్ణి పంచప్రాణాలుగా చూసుకుంటూ ఒక్కక్షణం విడిచిపెట్టలేదు.

ఆ పేరంటం ఏమయిందో తరవాత నాకు తెలిసింది.

ఉన్నంతలో చెరో మంచి చీరా కట్టుకుని ఇద్దరూ శ్యామల ఇంటికి బయలుదేరారు. అక్కడికి చేరేటప్పటికి ఇంటిబయట అంతులేని కార్లూ, అట్టహాసమూ ఉన్నది. పెద్ద పెద్ద సినిమాతారలూ, సినిమాప్రొడ్యూసర్లూ మగతారలూ, పెద్దలూ చేరారు. అందరూ పెద్దగా మాట్లాడుతూ, అల్లరిగా నవ్వుతున్నారు. మా ఆవిణ్ణిగాని, రుక్మిణినిగాని చూసినవారు లేరు. శ్యామల పెద్ద పెద్ద వాళ్లతో తప్ప మాట్లాడటం లేదు.

రుక్మిణి ప్రేరణమీద ఇద్దరూ వెళ్లి శ్యామలకు సాధ్యమైనంత దగ్గిరగా నిలబడ్డా ప్రయోజనం లేకపోయింది.

"ఏం పేరంటమిది, నా సెత్తిపేరంటం? పోదాం పదవమ్మా, వొదినా," అన్నది రుక్మిణి.

ఇద్దరూ బయలుదేరి వీథిలోకి అడుగు పెట్టబోతుండగా ఎవరో వెనకనుంచి వచ్చి చెరొకపొట్లమూ, ఇచ్చి, "చెప్పకుండా యెల్లుతుండారేం?" అన్నది.

అక్కణ్ణుంచి బయలుదేరి మాణిక్యం ఇంటికి పోయినారు. మాణిక్యం వాళ్లని చాలా ఆదరించింది. తన దగ్గిరే కూచోబెట్టి గంటసేపు సినిమాసంగతులూ అవీ చెప్పింది. రుక్మిణికి మర్నాడు షూటింగు కూడా చూపిస్తానన్నది. రుక్మిణికి ఆగంటసేపూ సినిమాలో వేషం వేస్తున్నంత ఆనందంగా గడిచింది.

....ఆ రాత్రే మా రుక్మిణి మొగుడు వచ్చాడు. వాడూ నేనూ కలిసే ఇంటి కొచ్చాం. మేం చేరేసమయానికే మా వాళ్లూ ఇంటికి చేరారు.

ఎక్కడికి వెళ్లారని నా భార్యను నే నడిగేసమయంలోనే వాడూ వాడి భార్య నడిగాడు.

"మాణిక్యంఇంటినుంచి వస్తున్నాం." అన్నది నా భార్య."

"ఏమి టనుకున్నారు? మేం శ్యామల ఇంటికి పేరంటం వెళ్లివస్తున్నాం! ఎన్ని కార్లూ! ఎంత గొప్ప సినిమాతారలూ! ఎంతెంత ఖరీదైన చీరెలూ! ఏమేమి..."

మా బావమరిది పెళ్లాం చెప్పే కబుర్లు వింటూ నోరు తెరుచుకుని అట్లాగే నిలబడి పోయినాడు......

---

# లోకభారం

[ఎ స్వార్]

నేను మోస్తున్న లోకభారంగురించి తల్చుకుంటే గుబులు పుట్టుకొస్తుంది. దేశాల్ని చిటికెనవేలుమీద నిలిపి ధరాచక్రాన్ని తిప్పుతున్నారని స్టాలిన్ నెహ్రూ ట్రూమన్ వంటి మహానాయకులనుకుంటారు. కాని నిజానికి వాళ్లు గోళీకాయలాడుతోంటే లోకభారాన్ని మోస్తున్నది నేను. అందరూ నన్నుద్ధరించడానికి జీవితాల్ని ధారపోస్తున్నవాళ్లే కాని సరిగా నా గోడు వినిపించుకునే దాత కనపడ్డు ఎక్కడో ఎవరో ఒక్కొక్క మహానుభావుడు తప్ప. గాంధీగారేమన్నారు? "నువ్వు ధాన్యం పండించకపోతే, నువ్వు పైసా శిస్తు కట్టకపోతే లోకాలు పగిలిపోతాయి" అన్నారు. పోనీ ఆసత్తా ఏమైనా నాలో వుందేమో చూద్దామంటే వీల్లేకుండా వొచ్చింది. నా సత్తా ఎంతుందో దండలకండరా లుబికించి చూసుకొందామంటే నలుగురూ నొక్కేస్తారు. మళ్లీ నేను స్వతంత్రభారతప్రజారాజ్యంలో స్వతంత్రపౌరుణ్ణే—అవడానికి. కాని ఏంలాభం?

తెల్లారి లేస్తే మళ్లీ రాత్రిపడేవరకూ నేనెంత పరిశ్రమ చేస్తున్నానో, ఏ వేం పన్లు చేస్తున్నానో, ఎంతమందితో వ్యవహరిస్తున్నానో, ఎవరే రీతిగా నాతో ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ వ్యవహారాలు నడుపుతున్నారో లెక్క వేసుకొని రిసెర్చి చెయ్యడం కష్టం. కాని ఈ తంతు చూస్తే చిత్రంగా వుంటుంది. గుబులు పుడుతుంది. ఒళ్ళు మండుకొస్తుందికూడా.

పండిట్ నెహ్రూ అన్నారు: "సుడిగుండాలూ ఊబిలూ గుట్టలూ గోతుల్తో నిండివున్న భయంకరమైన ప్రపంచంలో మనం బతుకుతున్నాం. రేపు ఎవడికేం సంప్రాప్తమవుతుందో ఎవరికీ తెలీదు." నా మట్టుకు నాకు ఈ భయంతోనే ప్రతిరోజూ నిద్రమెలకువొస్తుంది—మా పాపనవ్వుతో నా జుట్టు పీకిలేపినప్పుడు తప్ప. ఈ సుడిగుండాలూ ఊబిలూ తప్పించుకుంటూ, గట్లు దూకి గోతులు దాటి బతుకు నెట్టుకుంటూ, దేశస్వాతంత్ర్యాన్నీ, మనిషి స్వాతంత్ర్యాన్నీ కాపాడాలిట; కాపాడుకోవాలిట. అంతే కాదు. ఈ స్వాతంత్ర్యాలంటే ఏమిటో సరిగ్గా తెలుసుకోవాలి. మోతలూ నినాదాల్తో గింగుర్లెత్తిపోతున్న ప్రపంచంలో అడ్డమైనవాళ్లు తామిచ్చేది స్వాతంత్ర్యం అనీ, తాము నడిపేది ప్రజాస్వామ్య మనీ అంటారుట. సామ్రాజ్యవాదం అంటే ఇదివరకు మాదిరిగా నోరు తెరుచుకున్న సింహంలాగా తయారవదు. బహుశా గాడిదచర్మమో, గోవువేషమో వేసుకుని వొస్తుంది కాబోలు. అప్పుడు సింహమేదో, గాడిదేదో, గోవేదో పసికట్టే ముక్కు కొని తెచ్చుకోవాలి. లేకపోతే తీరా మనం గోవనుకొన్నది సింహం కావచ్చు, సింహమనుకున్నది గాడిద కావచ్చు. శిస్తు కట్టడంకంటె, వేరే ధాన్యపు పాత్రలు లేవని ధాన్యసేకరణాధికారులికి వచ్చ చెప్పడంకంటె, పంచదారరేషన్ కొనుక్కోడంకంటె కూడా ఈ ముక్కు కొని తెచ్చుకోడం మరీ కష్టంగా కనిపిస్తుంది. కాలేజిలో సీటు తెచ్చుకోడం కూడా అంత కష్టం కాదేమో. భారాలన్నిటిలోకీ ఈ భారం మరీ దుర్భరంగా ఉంది. ఇవన్నీ కలిపి మోసే లోకభారం నేను మొయ్యనన్నా, నామూపునించి దిగడం లేదు.

ఇప్పటికే భారతపార్లమెంట్‌వారు పాస్‌చేసిన శాసనాలు, రాష్ట్రప్రభుత్వం చేసిన శాసనాలు, జిల్లాబోర్డు బైలాస్, మా పంచాయితీబైలాస్ తెలుసుకుని ఇవన్నీ కలిసి ఏకమై గీసిన గిరిగీళ్లలో నడుచుకోడమంటేనే సాధ్యంకాకుండా ఉంది. రోజూ ఎక్కడో తప్పటడుగు పడి, గిరి దాటి ఒరగడం, మెల్లిగా కాలు కూడదీసుకోడం, ఈ కాలు కూడదీసుకునేలోగా రెండో కాలు ఎక్కడో ఏగీతనో తొక్కడం అది కూడదీసుకునేసరికి ప్రాణం అలిసిపోవడం జరుగుతోంది. మన ప్రజాప్రభుత్వాలు గీసిన గిరిగీళ్లలో ఒదిగి ఉండాలంటే అసలు ఒక్క కాలు మోపుకోడానికైనా జాగా కనిపించడం లేదు. ఇలా ఒంటికాలిమీద నిలబడి ప్రభుత్వాల్ని ఒకవంక (అంటే కరణాలు మునసబులు తాసీల్దార్లు కలెక్టర్లు ప్రొక్యూర్‌మెంట్ ఆఫీసర్లు జడ్జీలు కోర్టులు, అడ్డాల ఆస్పత్రులు, రైల్వేలు, ప్రాజెక్టులు తెల్లదీపాల బస్తీలు, బుచ్చిరెడ్డిపాలెం సిమెంట్ రోడ్లు పోలీసులు మలబార్‌పోలీసులు స్పెషల్‌పోలీసులు మంత్రులు మంత్రుల సంచారాలు వగైరా ఖర్చులన్నిటినీ,) నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు, ఫండ్లు, చందాల్నీ మరోకవంక మొయ్యాలి నేను. ఇంతా ఒంటికాలిమీద నిలబడి మోస్తూ, నా మోచెయ్యి ఇంకోడికి తగలకుండా, ఇంకోడి మోచెయ్యి నాకు తగలనివ్వకుండా గీసిన గిరిలో నిలబడి భగీరథుడిలా తపస్సు చెయ్యాలి. చేస్తున్నాను. అప్పుడప్పుడు కాలు బెసికిపడుతోంది. నా బరువుమోతకి ఒక భుజం కాయకపోయినా, కాలుబెసికి కొంచెం ఒరిగినప్పుడు మాత్రం ప్రభుత్వమో రాజకీయవాదులో అప్పులవాళ్ళో బ్లాక్‌మార్కెటీర్లో

[illegible] తున్నారు. రెండో కాలు మోపడానికి జాగా దొరికితేగాని అభ్యుదయం, పురోవృద్ధి. ముందడుగు ఎల్లాగో బోధపడ్డం లేదు. నన్ను పడేలాగుతున్నదీ, లేకపోతే నే మోస్తున్న బరువు చాలదన్నట్టు నెత్తెక్కి కూచుంటున్నదీ సింహమో, గాడిదో, తోడేలో తెలుసుకోవాలనీ, అందుకోసం కొత్త ముక్కు కొని తెచ్చుకోవాలనీ పండిట్ నెహ్రూ చెప్తారు.

కొత్తముక్కుమాట దేవుడెరుగు. నన్ను నిలబడి నా తపస్సు చేసుకోనిస్తే అదే చాలు. మా పాప చిరునవ్వొక్కటే నాకు ప్రాపుకనిపిస్తోంది.

అసలు ఈ కొత్త ముక్కు కొని తెచ్చుకోకపోతేం? మా పొరుగింటివాడు కమ్యూనిస్టయితేం, కాంగ్రెస్‌వాడైతేం, బ్లాక్‌మార్కెట్‌దారైతేం? నాకెందుకా గొడవ! ఆ ముక్కు సంగతి మరిచిపోయినా, రోజు గడుస్తోంది. నెయ్యని చెప్పి నూని ఇచ్చినా నూనని మరోటిచ్చినా, పంచదార కిరసనాయిలు రేషన్ను ఎగ్గొట్టినా, పాలలో నీళ్లు కాని మరోటి కాని కలిపినా ఏదో రోజులు నెట్టుకుపోతున్నాను. ఇవన్నీ జరుగుతోంటే చూస్తూ ఊరుకున్న ప్రభుత్వం చెప్తే కొత్త బరువెందుకు మొయ్యాలి? నే మోస్తున్న భారం నాకు చాలు. కొత్తముక్కు కొని తెచ్చుకున్నానంటే ఇంక సింహాలూ తోడేళ్లూ పోలీసులూ నన్ను పీక్కుతినెయ్యగలరు. నా గిరిలో నా ఒంటికాలు తపస్సు నన్ను చేసుకోనిస్తే అదే పదివేలు.

---

# విజ్ఞాన విశేషాలు

(17 వ-పేజీ తరువాయి)

గడ్డకట్టేటట్టుగా చల్లబడేసి, తీగలాగా సాగదీసి, ఆ తీగలోనుంచి, విద్యుత్తును ప్రసరింపచేశారు. బ్యాటరీ తీసేశాక రెండురోజుల తర్వాతకూడా, ఈ పాదరసం తీగలో విద్యుత్తు ప్రవహిస్తూనే వుంది. దీన్నే సూపర్ కండక్టివిటీ అంటారు. ఉష్ణ పరిస్థితులవల్ల పదార్థాలు గజిబిజికాని స్థితిలో పదార్థాల స్వభావాన్ని పరిశీలించటంవల్ల తక్కిన పరిస్థితులన్నిటిలోనూ ఈ పదార్థాలు ఎల్లా ప్రవర్తిస్తాయో జ్యోతిషం చెప్పినట్లు చెప్పటానికి వీలుకలిగింది శాస్త్రజ్ఞులకు. దీనితో పరిశోధనరంగంలో వాడవలసిన పదార్థాలు పెట్రోలు లాంటివి, అత్యుష్ణ పరిస్థితుల్లో ఎల్లా ప్రవర్తిస్తాయో, తెలిసికోటానికి వీలయింది. అధికధనవ్యయమొనర్చి అల్లాంటి పరిస్థితులు కల్పించుకొని ప్రత్యక్షంగా చేతులు కాల్చుకొని అనుభవం తెచ్చుకోవలసిన అవసరంలేకుండా పదార్థాలు ఎల్లా ప్రవర్తిస్తాయో ఈ శీతలస్థితిలో పరిశోధనవల్లే ఇట్టే తెలిసికొనేందుకు వీలయింది.

అబ్సల్యూట్ జీరోవద్ద సృష్టిలోని పదార్థమంతా జడమయిపోయి, ఏమాత్రమూ సంచలనం లేకుండా ఆగిపోతుందని శాస్త్రజ్ఞులు భావించేవారు. కాని, ప్రత్యక్షంగా ఈ పరిస్థితుల్లో పదార్థాలను పరిశీలించేటప్పటికి ఈ పదార్థాలలోని అణువులు, చాలా క్రమశిక్షణతో మెలగుతోన్న సైన్యంలాగా ప్రవర్తిస్తాయని తెలిసివచ్చింది. మామూలు ఉష్ణపరిస్థితుల్లో, అణువులు అంత క్రమంలేక గజిబిజిగా చెల్లాచెదరుగా తిరుగాడుతూవుంటాయి. కాని అబ్సల్యూటు జీరో సమీపంలో, చాలా సక్రమంగా, అడుగు తప్పకుండా నడుస్తున్నట్లుగా సంచరిస్తాయి

అబ్సల్యూట్ జీరోకు ఒకడిగ్రీలో శతాంశమువరకూ సమీపించారు. ఈ శతాంశము సాధించటంలో మరింకెన్నో నూతనవిషయాలు సృష్టిరహస్యాలు, కనుక్కోవచ్చునని, శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నారు.

---

# ఇండొనీషియా

(22-వ పేజీ తరువాయి)

యన్ ప్రజలు వేలూ, లక్షలుగా వచ్చి నెహ్రూను సన్మానిస్తున్నారు. అక్కడక్కడ డచ్చివారు బ్రిటిష్‌వారు అమెరికన్ల ప్రాబల్యంపైన జాతీయప్రభుత్వాన్ని ఎదిరించిన క్రైస్తవుల్ని. పూర్వసైనికుల్ని నిర్లక్ష్యపరిచి, ఇండొనీషియా ప్రజానీకం యావత్తు జాతీయప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలను పెంపొందించుకోడానికి పండిట్ నెహ్రూ ఇండొనీషియాయాత్ర తోడ్పడవచ్చును. ఇటువంటి ఆసియాజాతీయభావం ఆంగ్లో-అమెరికన్ వర్గానికీ, కమ్యూనిస్టువర్గానికీ కంటగింపుగా ఉండచ్చును. కాని పాశ్చాత్యులు ఆసియా దేశాల్ని నిర్లజ్జగా నిర్దాక్షిణ్యంగా దోచుకుంటున్నంతకాలం ఈ ఆసియా జాతీయభావం బలపడుతూనే ఉంటుంది.

దేశాలకు, జాతులకు వర్ణాలకు మతాలకు అతీతమైన ఈ ఆసియా జాతీయభావానికి పండిట్ నెహ్రూ చిహ్నమైనాడు. ఆసియావాసులకు పండిట్ నెహ్రూ నాయకత్వం పట్లనూ, భారతప్రభుత్వ విదేశాంగనీతి పట్లనూ ప్రబలవిశ్వాసం ఏర్పడింది. ఈ విశ్వాసం మైత్రి ఉభయదేశాల మధ్యనూ పెంపొంది స్థిరపడగలిగినట్లయితే, ఆసియా అంతటా ఈ నూత్న జాతీయభావం బలపడగలదు. దీనితో ఆంగ్లో అమెరికన్ వర్గం పన్నుతున్న కుట్రలు, కమ్యూనిస్టుల కుట్రలు విఫలమై, ఆసియా అంతటా నూతనసమాజనీతి, రాజనీతి, వ్యాప్తమై బహుళజనోపయుక్తమైన రాజకీయ సాంఘిక ఆర్థిక వ్యవస్థాస్థాపనకు అవకాశమేర్పడవచ్చును. ఈ నూతన చైతన్యానికి ఇండియా ఇండొనీషియాల మైత్రిసహకారాలు పునాది కాగలవు; పండిట్ నెహ్రూ చిహ్నం కాగలడు.

---

**గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ**
**మదరాసు 5.**
(ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము)

తాళపత్రములపైగాని, కాగితములు మొదలైన వాటిపైగాని వ్రాయబడిన ప్రాచీన గ్రంథములను సంగ్రహించి వాటిని భద్రపరచుటకై లైబ్రరీక్యూరేటరుగారు తగిన సహాయము చేయుదురు. సదరు గ్రంథములు కలవారు పైగ్రంథాలయమునకు తమవద్దనున్న లిఖితగ్రంథములను ఉచితముగా నిచ్చుటకుగాని, అమ్ముటకుగాని, పై లైబ్రరీలో తమ గ్రంథములను కాపీచేసికొనుటకు ఎరువులుగాగాని పంపించుటకు అనుమతించగలవారు పై లైబ్రరీక్యూరేటరుగారికి తెలియపరచవలసినదిగా కోరడమైనది. విలువగల ప్రాచీన లిఖితగ్రంథముల ఆచూకీ తెలిపినయెడల క్యూరేటరుగారే స్వయముగా ఆయా గ్రంథములు కలిగియున్నవారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపెదరు.

లిఖితగ్రంథ సేకరణకై క్యూరేటరు గారికి తోడ్పడినవారికి యథోచితముగా "కమీషను" ఇయ్యబడును.

# నేటి ప్రపంచం

(8 వ-పేజీ తరువాయి)

అమెరికాలో ఒక రిపబ్లికన్ సెనేటర్ ట్రిగ్వేలీ కమ్యూనిస్టు అని కూడా ఆరోపించాడు.

భద్రతామండలిసభ్యుల్లో ఫ్రాన్సు, బ్రిటన్, నార్వే, ఈజిప్టు దేశాలుకూడా రష్యా, యుగోస్లావియా భారతదేశాలతో కలిసి చీనాకమ్యూనిస్టుప్రభుత్వప్రతినిధిని ప్రవేశపెట్టడానికి, చియాంగ్ ప్రభుత్వప్రతినిధిని వెళ్ళగొట్టడానికి వోటుచేసినట్లయితే ప్రస్తుతప్రతిష్టంభన తొలగిపోవచ్చును. ఫ్రాన్సు, ఈజిప్టు, నార్వే, బ్రిటన్లతో ట్రిగ్వేలీ ఈ విషయమై సంప్రదింపులు జరుపుతున్నట్లుకూడా వార్తలు వస్తున్నాయి. ఏడుదేశాలు అనుకూలంగా వోటు చేసే పక్షంలో వీటో ప్రయోగించరని అమెరికన్ విదేశాంగమంత్రి డీన్ ఏచిసన్ వాగ్దానమిచ్చాడు. బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాలు సుముఖంగా ఉన్నట్లు సూచనలు కనిపిస్తున్నవి. కాబట్టి చీనాప్రాతినిధ్యసమస్య జూన్ జూలై మాసాల్లో పరిష్కారం కాగల అవకాశం లేకపోలేదనుకోవచ్చును. అయితే, చీనాప్రాతినిధ్యసమస్యని మిగతాదేశాల ప్రవేశంతో ముడిపెట్టినట్లయితే రష్యాఅమెరికాలే వైఖరి అవలంబించగలవో తెలియదు. ఆ యా దేశాలప్రవేశంపైనా చీనాప్రాతినిధ్య సమస్యపైనా అంగీకారం కుదిరినప్పటికీ, ట్రిగ్వేలీగారి మిగతా తొమ్మిదిఅంశాలూ పరిష్కారమయ్యే అవకాశం కనిపించదు. అమెరికా రష్యాలు రెండూ దేశరక్షణ, యుద్ధసన్నాహ కార్యక్రమాల్ని ముందే నిర్ణయించుకున్నాయి. ఆ కార్యక్రమాలకి, ముఖ్యంగా అట్లాంటిక్ డిఫెన్సు కార్యక్రమానికి మార్పులు తెచ్చే సూచనగాని కనిపించదు. ఆంగ్లో—అమెరికన్ వర్గ దేశాలు అయిదేళ్ళలో యుద్ధం సంభవించగలదనే అంచనా వేసి తత్ప్రకారం యుద్ధసన్నాహకార్యక్రమాల్ని అనుసరిస్తున్నాయి. దీన్ని ఇంకోరీతిగా చెప్పడం సబబుగా ఉంటుంది. విమానాలు సబ్మెరైన్లు ఏటంబాంబులు వగైరా తమ యుద్ధావసర పరికరాల తయారీకి ఇంచుమించు నాలుగేళ్లు పైగా వ్యవధి పట్టుతుంది కాబట్టి, ఆంగ్లో అమెరికన్‌వర్గం అప్పటికి యుద్ధం సంభవించవచ్చునని అంచనా వేస్తోంది. రష్యావర్గం ఎంత వ్యవధి అంచనా వేసుకుందో తెలియదు.

# అమెరికా ఆర్థికసహాయం *

యూరప్ ఆర్థిక పునర్నిర్మాణానికి 285 కోట్ల డాలర్లు, అట్లాంటిక్-పాక్టు దేశాల ఆయుధసైనికబలనిర్మాణానికి 100 కోట్ల డాలర్లు వెచ్చించడానికి అమెరికన్ కాంగ్రెస్ ఆమోదించింది. ఇది కాక ఆర్థికంగా హీనస్థితిలో ఉన్న తూర్పు ఆసియా, ఆఫ్రికా, దక్షిణఅమెరికాలలోని దేశాలలో ప్రజారోగ్య కార్యక్రమాలు, రవాణా సేద్య అభివృద్ధికి నిపుణులసహాయం మొదలైనవాని నిమిత్తం 3½ 2 కోట్లడాలర్లు, దక్షిణకొరియా, ఫిలిప్పైన్సు మొదలైనదేశాలకు 19 కోట్ల 40 లక్షల డాలర్లు, పాలస్తీనాలోని, అరబ్ శరణార్థులకు కోట్ల 74½ లక్షల డాలర్లు, ఐక్యరాజ్యసమితివారి శిశుక్షేమనిధికి 1½ కోట్ల డాలర్లు ఆర్థికసహాయ మివ్వడానికి మంజూరయింది. మొత్తం ఈ సంవత్సరం ఆర్థికసహాయం 312 కోట్ల 14½ లక్షల డాలర్లు.

1950 జూలై 1 నుంచి 1951 జూన్ వరకు అట్లాంటిక్ పాక్టు దేశాలకు 100 కోట్ల డాలర్లు కాక, గ్రీస్ టర్కీలకు 12 కోట్లడాలర్లు, ఇరాన్, దక్షిణ కొరియా, ఫిలిప్పైన్సు దేశాలకు 2 కోట్ల 75 లక్షల డాలర్లు, చీనా సమీపప్రాంతాలకు (ఫార్మోజాసహా) 7½ కోట్లడాలర్లు ఆయుధసైనికబల నిర్మాణానికి సహాయం చెయ్యడానికి కాంగ్రెస్ ఆమోదించింది. మిలిటరీసహాయం 1949 అక్టోబరులో ప్రారంభమయింది. అప్పటినుంచి 1950 జూన్ 30 వరకూ మొత్తం 131 కోట్ల 40 లక్షల పదివేలడాలర్లు వెచ్చించబడింది. 1950 జూలై 1 మొదలు ఒక సంవత్సరం వరకు మొత్తం 122 కోట్ల 25 లక్షల డాలర్ల ఆయుధసామగ్రి మొదలైనవి రవాణా అవుతాయి.

అంటే అమెరికా ఈ సంవత్సరం పరదేశాలకు సహాయం పరంగా 434 కోట్ల 39½ లక్షల డాలర్లు వెచ్చిస్తున్నదన్నమాట. భారతప్రభుత్వం బడ్జెట్ అంతా కలిపితే ఇందులో పదోవంతుకూడా లేదు.

దీనితో అమెరికాలో అనేకరకాల పరిశ్రమలకి గిరాకీ అందుకుంది. ఉక్కు, మోటార్లు, రసాయనికపరిశ్రమల కంపెనీల షేర్లు పూర్వ ఆర్థికమాంద్యానికి ముందు పెరిగిపోయినట్లు పెరిగిపోయినాయి. అమెరికన్ కాంగ్రెస్ ఈ ఖర్చులన్నిటినీ ఆమోదించే సూచనలు కనిపించగానే కంపెనీలు కొత్తఉద్యోగుల్ని కార్మికుల్ని నియమించుకోడం ప్రారంభించాయి. నాలుగులక్షలకి పైగా ఉన్న నిరుద్యోగుల సంఖ్య రెండువారాల్లో 8½ లక్షలకి తగ్గిపోయింది. త్వరలోనే అమెరికాలో నిరుద్యోగం నిర్మూలమౌతుందని అంచనా వేస్తున్నారు.

అమెరికాలో పరిస్థితి ఈరీతిగా ఉండగా, కేవలం అమెరికన్ల దాక్షిణ్యంపైనే ఆధారపడిఉన్న జర్మనీ ప్రాంతాలలో నిరుద్యోగం నానాటికీ పెరిగిపోతోంది. జర్మనీలో పెద్దపరిశ్రమల్ని పడగొట్టి, వారి యంత్రపరికరాల్ని అమెరికాకీ బ్రిటనుకీ ఫ్రాన్సుకీ నష్టపరిహారంగా తరలించుకుపోతున్నందువల్ల నిరుద్యోగం మాసానికి 80 వేల చొప్పున పెరిగిపోతోందని అంచనా వెయ్యబడింది. యుద్ధతంత్రంలో అత్యంతసమర్థులైన జర్మన్లని ఫ్రెంచి, అమెరికన్ సైనికదళాల్లో నియమిస్తున్నారనీ, జర్మన్ ప్రజల్ని, జర్మనీదేశాన్ని మూడో ప్రపంచ యుద్ధంలో వినియోగించడానికి సంసిద్ధపరుస్తున్నారనీ ఇందుకే జర్మన్ పరిశ్రమలు పడగొట్టబడుతున్నవనీ అంటున్నారు. జర్మనీజాతీయ ఆర్థిక సమస్యలను కొంతవరకు పరిష్కరించి ఫ్రెంచివారితో సమానమైన ప్రతిపత్తి లభింపచెయ్యగలదనే ఆశతో పశ్చిమజర్మనీ ఛాన్సలర్ అడినార్ జర్మన్-ఫ్రెంచి పరిశ్రమల విలీనీకరణకార్యక్రమానికి వెంటనే అంగీకరించాడు:

ఇదైన తరవాత జపాన్‌తో శాంతిసంధి చేసుకునే అవసరం లేకనే పసిఫిక్ ప్రాంత రక్షణసంధి ఒకటి తయారుచేసి దానికి జపాన్, ఆస్ట్రేలియా, తూర్పుఆసియా దేశాలను ముడిపెట్టినట్లయితే, ఈ ప్రాంతంలో కూడా భారతదేశంసహాకారంతో నిమిత్తంలేకుండా, తన ఆర్థిక సైనిక ప్రాబల్యాన్ని పెంపొందించుకోవచ్చునని అమెరికా యోచిస్తోంది. యూరప్ సైనికంగా బలపడిన తరవాత ఇంక కమ్యూనిస్టురాజ్యాలతో బలాబలాల్ని ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని పరీక్షచేసుకోడానికి సైనికంగా బలహీనంగా ఉన్న ఆసియా ఉభయులకీ చక్కని రణరంగం కావచ్చును. [సూర్యనారాయణ]

కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహపుమచ్చలు, సెగ, సవాయివ్యాధులకు, గ్యారంటీ చికిత్స, క్యాటలాగు ఉచితం

జి వి. రెడ్డి అండ్ కో., "భాస్కరాశ్రమము", గోపాలపురం, తూర్పు గోదావరిజిల్లా

# రుద్రమదేవి

(11 పేజీ తరువాయి)

కోరంగినావలపైకి బయలుదేరినవి. ఈ మాటు ప్రయత్నము ముమ్మరముగా సాగుచున్నది. కాని వాయువుమాత్రము చోళనావల కనుకూలముగా లేదు. ఈ ప్రయత్నము విఫల మైనచో చోళనావలు వెనుకకు తిరిగివచ్చు నని విశ్వాసము లేదు.

ఇక భూసేనల యుద్ధము మాత్ర మిప్పటికి సమముగా నున్నది. ఆంధ్రగజముల తాకుకు ముందు కాడవసేనలు కలగినను, తెప్పిరిల్లుకొని సూక్ష్మమార్గములు గ్రహించి యాంధ్రసేనలను చీకాకుపరచుచుండెను. మరియు వారొక ప్రయత్నము చేసిరి. ఒక పెద్ద యశ్వదళమును చుట్టుమార్గమున బోయి జన్నిగసేనలను వెనుకవైపునుండి డీకొన బ్రయత్నించిరి. కాని యట్టి ప్రయత్నము జరుగవచ్చు నని ముందుగనే జన్నిగ యూహించి, ప్రతిఘటించుటకు చేరుగా నాత డాశ్వికదళముల నుంచెను. అందుచే కాడవసేనలు ఎన్నిమారులు వెనుకవైపుకు రావలె నని యత్నించినను, ఆ యత్నములన్నియు నరికట్టబడెను.

కాడవహయదళములు ఒకటి మారి మరియొకటి యుద్ధనాసీరమునకు దూకుచుండెను. ఐనను సాయంత్రము మూడుజాములగు నప్పటికి మొత్తముమీద నవియన్నియు నలసిన ట్లున్నవి. అశ్వములు సుకుమారప్రాణులు. గజము లట్లు కావు. అందును ఆంధ్రగజములు ఈనాడు కడుపులనిండ మద్యము సేవించినవి. అలసినప్పుడెల్ల వానికి మరల మద్యము పుష్కలముగా పోయించి యుద్ధముఖమునకు దెచ్చుచుండిరి. మద్యసేవనమువలన కొంతవడికి వచ్చు నీరసభావము, ఈ ఏనుగుల నెప్పటి కావేశించును ? సాయంకాల మగులోపల నది వచ్చునెడల, కాడవసేనలు జయించుట సాధ్యము. లేనిచో కొప్పెరుంజింగడు ఆత్మరక్షణప్రయత్నములో నుండవలెను !

కొప్పెరుంజింగ డా వార్త కాశ్చర్యపడెను. హృదయములో నధైర్య మావేశించెను. పూర్వ మాతడు గణపతిదేవచక్రవర్తులచే జితుడయ్యెను. మరల నిప్పటికి రెండేళ్ల క్రిందట పాండ్యసేనలచే నిర్జితుడయ్యెను. కాని యాత డెన్నడును తన రాజసింహత గోల్పోయి యుండలేదు ; దర్పము గోల్పోలేదు.

వెంటనే యాతడు తీక్ష్ణముగా నాలోచించెను. వెంటనే యాతడు వసిష్ఠగోదావరి యావలకు, తన రక్షణకై కొన్ని సేనల దాటియుండ నాజ్ఞాపించి, యావల సముద్రతీరమున సంకేతస్థలమున తన్ను తీసికొనిపోవుటకు కొన్ని చోళనావలను వేచియుండ నియమించెను. అంతట నాత డెన్నియో విషయము లాలోచించి తన సేనానుల కుత్తరువులు పంపెను. అందులో శతఘ్నులను ప్రయోగించుట యొకటి ! ఈ ప్రయత్నము లన్నియు విఫలములై, తన భూసేనల కీనాడు అపజయము సంభవించున ట్లున్న యెడల పెనుదగ్గి, సేనలను విచ్చిపోనీయక, వసిష్ఠగోదావరి ననుసరించి యుత్తరముగా ప్రయాణము చేసి శీఘ్రగమనమున ముసలపురము చేరికొనవలసిన దని యాజ్ఞాపించి, తానుగూడ సముద్రమార్గమున మోసలపురమే చేరికొందు నని తెలియజేసెను.

సూర్యాస్తమయము కాబోవుచున్నది ! సముద్రముపై యుద్ధమే విధముగా సాగుచున్నదో నమ్మకమైన వార్త రాలేదు. ఇటు నటుగా నున్నది ! ఈవల గజములు మాత్రము నిస్సార మగుచున్నవనియు, రాజసింహుని యాజ్ఞలు పాలించినపిమ్మట హయదళములు తేరుకొనుచున్న వనియు, భయపడ నవసరములేదనియు, కాడవసేనానులు తమ ప్రభునకు సంతోషవార్త లంపిరి.

అది విని కొప్పెరుంజింగడు చిదంబరేశ్వరు డగు కనకసభాపతి నటరాజస్వామికి మనసా వందన మాచరించెను!

ఇక నాంధ్రపండితులకు తాను నిజముగా జనకమహారాజునకు తుల్యుడ ననియే ప్రదర్శింప నాతడు నిశ్చయించెను. అప్పటికే పండితు లాతని పూజాస్థానమునకు ఒక్కరొక్కరె చేరికొనుచుండిరి. కేరళనటులు "ఊరుభంగ"రూపకప్రదర్శనమునకు సిద్ధముగా నుండిరి.

సంధ్యావేళ కాగానే కొప్పెరుంజింగడు శుచియై సంధ్యావందనోపాసనాదికము నిర్వర్తించి సాయంకాలపూజ ప్రారంభించెను. అదియు నాతడు లఘువుగా చేసి సాయంకాలపూజాంగముగా వేదవేదాంగాదిశ్రవణమును సూక్ష్మముగా కానిచ్చెను. శ్రీమద్రామాయణమహాభారతభాగవతశ్రవణ మైనది. ఆపిమ్మట పురోహితు డిట్లనెను.

"శ్రీ మదఖండభూమండల బ్రహ్మాండనాయక, సచ్చిదానంద విగ్రహ, ఆశ్రితసంరక్షణార్థకృతావతారదివ్యమంగళవిగ్రహ చిదంబరమహాక్షేత్రనిజాధివాస, సర్వపుణ్యక్షేత్రాధివాస, శ్రీ కనకసభాపతిమహాస్వామిన్, శ్రీమద్రాజసింహపరమస్వామిన్, సంధ్యాతాండవకుశల, నటరాజశేఖర, సాయంకాలపూజాంగత్వేన శ్రీ దేవీభాగవతశ్రవణానంతరం ఊరుభంగరూపక భరతప్రయోగ మవధారయ !"

గోదావరిపండితులలో "ఊరుభంగము ! ఊరుభంగము ! ఊరుభంగము !" అని యా రూపకనామము పలుమా రుచ్చరింపబడుచున్నది. అట్లని వారు ముఖములు చిట్లించి చప్పరింతురు. "ఆవల మహాయుద్ధములు జరుగుచుండగా నీ యమంగళ నామము గల రూపకమే ప్రదర్శనమునకు వీరికి దొరికినదా ?"

కేరళనటులు రంగస్థలము సర్వసన్నద్ధము చేసియుండిరి. నేపథ్యమున దివ్యజ్యోతి వెలిగెను. నటులు "జాతవేదసే" ఇత్యాది మంత్రములు తెరచాటున సుస్వరముగా పఠించిరి. ఆ నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించెను.



56 వ అఖిలభారత కాంగ్రెసుమహాసభ జరుపుటకుగాను నాసిక్‌లో యేర్పాటుచేసిన ప్రదేశం. పదివేలమందికి ఆశ్రయమివ్వగల విశాలప్రదేశం.

# వార్తా చిత్రాలు



నాసిక్‌లో, 56 వ అఖిలభారత కాంగ్రెస్ మహాసభ జరగటానికిగాను యేర్పాటుచేసిన స్థలాన్ని, మహారాష్ట్ర కాంగ్రెస్‌సంఘం అధ్యక్షులు శ్రీ బి. యస్. హిరే, శ్రీ యన్. వి. గాడ్గిల్ మొదలైన ప్రముఖులు పరిశీలించుచున్నారు.





జపాన్ చిత్రకారుడు ఇచిరో స్టుటాకనో తరఫున శ్రీ పి. రత్నంగారు భారత రిపబ్లిక్ అధ్యక్షులు డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారికి గాంధీ పతకాన్ని బహూకరించారు.

Regd. No. M. **4479**





కళాప్రపూర్ణ

కీ॥ శే॥

కాశీనాథుని నాగేశ్వరరావుగారి

ఉత్కృష్టరచన

# ఆంధ్రవాఙ్మయ చరిత్ర

సరికొత్తపద్ధతిని, సంగ్రహరూపంలో నడిచిన సమగ్రసమీక్ష. వెయ్యేండ్ల వాఙ్మయ చరిత్రకు విశుద్ధదర్పణం. పాతచరిత్రల నన్నిటిని అవలోడన చేసి, సమన్వయించి క్రోడీకరించిన సిసలయిన చరిత్ర.

శాసనాలలోనూ వాటిలోనూ అవ్యక్తస్వరూపంలో ఉండి ఉండి, నన్నయధర్మమా అని ఒక్క ఊపున దివ్యాకారంతో బైటపడి, నానాటికి నవనవోజ్జ్వలంగా వికసించిన మన వాఙ్మయం పోయిన పలుపోకడలను పోడిమితో చూపెట్టజాలిన ఉత్తమగ్రంథం.

**వెల రూ. 2-0-0** తపాలాఖర్చు **0-7-0**

---

## ఆంధ్రగ్రంథమాల

పోస్టుబాక్సు నెం. **212,** మద్రాసు.

**Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras**